31.3.1995 1995 శుక్రవారం 20 పేజీలు సంపుటి: 67 సంచిక: 13 విడిప్రతి: రు.2.00లు Phone: 27354 Regn. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు [illegible]: నెల్లూరు శ్రీరామ మూర్తి

## ఈ భారం మోయగలడా?

ఆనం వివేకానంద రెడ్డి మునిసిపల్ ఛైర్మన్‌గా పదవీ ప్రమాణ స్వీకారం చేశారు. 29 తేది ఉదయం సరిగ్గా 11 గంటలకు కలెక్టర్ శ్రీ ప్రేమచంద్ ఆయన చేత ప్రమాణం చేయించారు. ఎసి బొమ్మ నుంచి పెద్ద వూరేగింపుగా బయల్దేరి బొట్ల మోత మార్మోగుతుంటే మహదానందంగా బాధ్యత స్వీకార పత్రం పై సంతకం చేశారు వివేకానంద రెడ్డి. కెవిఆర్ చంద్రయ్య, మాగుంట తరపున శ్రీ పివి ప్రసన్న రెడ్డి, సునీల్ కుమార్ రెడ్డి తదితర యువ నాయకులంతా ప్రక్కన నిలబడి వుండినారు.

తర్వాత 44 మంది కౌన్సిలర్ల చేత వివేకా ప్రమాణ పత్రాలు చదివించారు. గంటకు పైన పట్టింది తతంగం. కొందరు కౌన్సిలర్లకు తెలుగు చదవడమే చేత కాలేదు. కాంగ్రెస్‌లో కెవి రాఘవ రెడ్డి, చాట్ల నరసింహ రావు ఇంగ్లీషులో ప్రమాణాలు చదివారు. 12 వార్డు కౌన్సిలర్ ఎ. భానుప్రసాద్ రాజా "దీన జన బంధువు పివి ప్రసన్న రెడ్డి సాక్షిగా" ప్రమాణం చేశారు. ఎట్టెట్టుగా వుండిందా దృశ్యం. మహిళా కౌన్సిలర్లు చాలా ఉత్సాహంగా ముస్తాబై వచ్చి ఆహ్లాదం కల్గించారు. 26 వార్డు కౌన్సిలర్ ఆసియా బేగం సాంప్రదాయంగా ముస్లిం స్త్రీలు వివాహ సమయంలో ధరించే ఆకు

> చిరకాలవాంఛితం ఈడేరిందన్న సంతసం-
> ముళ్ల కిరీటం తల పై చేరిందన్న నీరసం!

పచ్చ చమ్కీల చీర ధరించి అందరి దృష్టినీ ఆకర్షించారు. ఇండి పెండెంట్‌లు వి. సుబ్బారావు, సందాని భాషాలు ప్రత్యేక వూరేగింపులతో వచ్చారు. కాంగ్రెస్, పి. విజయ కుమార నాయుడు ప్రమాణం చదివే టప్పుడు చప్పట్లు మార్మోగాయి. ఈ తతంగం తర్వాత పెద్ద వూరేగింపు నిర్వహించారు. మద్రాసు బస్టాండ్, ట్రంకురోడ్డుల మీదుగా ఎసి బొమ్మ వరకు జరిగింది వూరేగింపు;

ఐ. పివి ప్రసన్న రెడ్డి వూరేగింపు చివరి వరకు వివేకానంద రెడ్డిని అంటి పెట్టుకొని వుండడం విశేషం. వివేకా గెలుపులో తమ సహకారం వుందన్న సంగతి ప్రజలందరికీ స్పష్టంగా తెలియాలన్న తహతహ మాగుంట వర్గీయులలో కన్పించింది.

మాజీ ఎమ్మెల్యే శ్రీ కె.వి. సుబ్బారెడ్డి మాత్రం ముఖం తప్పించారు. పిల్చినా సభకు రాలేదు. మొన్న వ్యతిరేకం చేసి ఈ రోజు ముఖానికి నవ్వు పులుముకొని ప్రక్కన నిలబడాలంటే కష్టం కదా? మరొక మాజీ ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి గారు కూడా ఆ ఛాయలకు రాలేదు. చిన్న పొరపాటుతో,

ప్రక్కన నిలబడి సారథ్యం వహించాల్సిన స్నేహితుడై వుండి కూడా

ప్రమాణ స్వీకారానికి ఫోటో యేముంది. [illegible] బొమ్మకు పుష్పాభిషేకం జరుపుతున్న ఛైర్మన్ ఆనం వివేకానందరెడ్డి

కౌంటింగ్ తర్వాత నెల్లూరులోనే లేకుండా వెళ్లి పోవలసిన విచారకర పరిస్థితి నెదుర్కొన్నారు జెకె రెడ్డి.

తెలుగుదేశానికి సంబంధించి ఎమ్మెల్యే రమేష్ రెడ్డి కాని, ఓడిన అభ్యర్థి నైటి నాయుడు కాని, మరే నాయకుడు కాని ప్రమాణ స్వీకారానికి హాజరు కాలేదు.

ఎర్రటి ఎండ; వళ్లు తడచి పోయే ఉబ్బ; ఆ ఉక్క పోతలో క్రిక్కిరిసిన జనం మధ్య ప్రమాణ స్వీకారాలు. నెత్తి మాడే ఎండలో టౌనంతా ఊరేగింపు చేయ వలసి రావడంతో అందరూ మాడి పోయారు. పాపం వివేకానంద రెడ్డి అతి శ్రద్ధతో కాపాడుకొనే గ్లామర్ కూడా పోయింది. నల్లగా [illegible]

* * *

వివేకానందరెడ్డి చిరకాల వాంఛితమిది. ఎమర్జెన్సీ సమయంలో, నెల్లూరు ఉపమ్యునిసిపల్‌గా రాజకీయ రంగ [illegible] చేసినప్పటి నుంచి ఈ ఇరవయ్యేళ్లలో [illegible] తప్ప అదృష్టమనేది వివేకానందరెడ్డి దరికి చేర లేదెప్పుడూ!.

ఆ దినాల్లో ఎన్నికలు జరిగివుంటే, అప్పుడు ఆనం కుటుంబానికి టౌన్‌లో వున్న ప్రాపకానికి, ప్రాభవానికి ఆనాడే ఛైర్మన్ అయివుండేవాడు. కాని, వెంగళరావు ప్రభుత్వం ఎన్నికలే జరిపించ లేదు. అంజయ్య ఎన్నికలు నిర్వహించే నాటికి (1985లో) ఛైర్మన్ కుర్చీ రిజర్వు అయ్యింది. ఛాన్సు పోయింది. 1987 లో [illegible] టిక్కెట్ కరుణించలేదు.

[illegible] 1983లో

(కరువ 7 పేజీలో)

# స్టాక్ మార్కెట్ పై కనీసం ఒక ఏడాది ఆశలు లేనట్లే!

స్టాక్ మార్కెట్ భవిష్యత్తు రాను రాను ప్రశ్నార్థకంగా మారి పోతున్నది. కేంద్ర ప్రభుత్వంలో రాజకీయ అస్థిరత స్టాక్ మార్కెట్‌ను క్రుంగ దీస్తున్నది. బదలా విధానం, ఫార్వర్డ్ ట్రేడింగ్‌ల విషయంలో కమిటీ నివేదిక, సిఫార్సులు పరిస్థితిని ఏ మాత్రం మెరుగు పరచ లేక పోయాయి. బొంబాయి స్టాక్ ఎక్ఛేంజిలో రోజు రోజుకు వ్యాపార పరిమాణం కుంచించుక పోతున్నది. మూడు నెలల క్రితం ప్రారంభమైన ఈ దుస్థితిలో ఎటు వంటి మార్పూ లేక పోవడం విచార కరం. బిఎస్ఇలో ఇప్పుడు షేర్ల లావాదేవీల విలువ కేవలం 60 కోట్ల లోపుకే పరిమిత మౌతున్నాయి. మొత్తం షేర్ల విలువలో ఇది ఒక శాతం మాత్రమే. బొంబాయి స్టాక్ ఎక్ఛేంజిలో దాదాపు ఐదు వేల కంపెనీలు లిస్ట్ అయి వుంటే, వ్యాపారం జరిగే షేర్ల సంఖ్య ఐదారు పదులకు మించి వుండడం లేదు. ఎ గ్రూపులో లావాదేవీలు ఎసిసి, రిలయన్స్ వంటి కొద్ది కంపెనీలకు మాత్రం పరిమిత మౌతున్నది. బి గ్రూపులోనూ 50 నుంచి 100 కంపెనీల షేర్లు మాత్రమే చేతులు మారుతున్నాయి. దీనివల్ల వివిధ కంపెనీలలో పెట్టుబడులు పెట్టిన వేలాది మంది ఇన్వెస్టర్లు లిక్విడిటీ లేక ఇబ్బంది పడి పోతున్నారు. షేర్లు అమ్మే వాళ్లు తప్ప, కొనే వాళ్లు కన్పించడం లేదు. బడ్జెట్‌లో పారిశ్రామిక సంస్థలకు కల్పించిన రాయితీలు ఎక్సైజ్ డ్యూటీ తగ్గింపుల ప్రభావం షేర్ మార్కెట్ పై ఏ మాత్రం చూపలేదు.

అయితే బదలా విధానం పైన, ఫార్వర్డ్ ట్రేడింగ్ పైన పటేల్ కమిటీ చేసిన సూచనలు ఇన్వెస్టర్లకు క్షేమంగా

> ఐదు వేల కంపెనీలు లిస్టింగ్‌లో వున్నా వ్యాపారం జరిగేవి ఐదు పదులు లేవు; అమ్మే వాళ్లు తప్పకొనే వాళ్లు లేరు!

వున్నాయి. బ్రోకర్లు మాత్రం ఇబ్బంది పడి పోతున్నారు. అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. కాని, ఈ నూతన విధానం కూడా రిలయన్స్ ఎసిసి వంటి పెద్ద కంపెనీలకు ప్రయోజనం చేకూరుస్తుంది తప్ప చిన్న కంపెనీలకు వుపయోగ పడేట్లు లేదు. అందువల్లే బదలా విధానం ప్రకటించినా షేర్లలో వ్యాపారానికి పెద్దగా అవకాశం కన్పించడం లేదు. ఈ పరిస్థితు లన్నింటినీ పరిశీలించి చూస్తే షేర్ మార్కెట్ కోలుకొని, తిరిగి తన పూర్వపు ఔన్నత్యాన్ని సంతరించు కోవడానికి కనీసం ఏడాది సమయం పట్టేట్లుంది. అప్పటి వరకు మార్కెట్ పై ఆశలు లేనట్లే!

## బడ్జెట్ వల్ల ప్రయోజనం కొంచమే!

మొన్నటి బడ్జెట్ వల్ల షేర్ మార్కెట్‌కు పెద్దగా ప్రయోజనాలేవీ సమకూరలేదు. చర్మ పరిశ్రమ, కాగితం పరిశ్రమలు మాత్రం లాభ పడుతున్నాయి. పేపర్‌కు సంబంధించి శేషసాయి పేపర్ మిల్స్, వాల్ పర్స్ కంపెనీలు లాభ పడ్డాయి. చర్మ పరిశ్రమకు సంబంధించి మిడ్ ఈస్ట్, రామ్ లెథర్స్ కంపెనీల షేర్ల ధరలు కొద్దిగా పెరిగాయి.

బడ్జెట్‌లో బ్యాంకింగ్ రంగానికి పెద్ద దెబ్బ తగిలింది. జనాకర్షణ కోసం ప్రకటించిన 10 లక్షల ఇళ్ల నిర్మాణానికి 3 వేల కోట్లు, ఖాదీ పరిశ్రమకు వెయ్యి కోట్లు, గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలకు పెద్ద పెద్ద మొత్తాలు బ్యాంకులే సమకూర్చ వలసి వుంటుంది. పేదరిక

(కొరవ 12 పేజీలో)

# కొత్త పబ్లిక్ ఇష్యూ షేర్లు సైతం తిరిగి అమ్మడం కష్టమే!

కొత్తగా పబ్లిక్ ఇష్యూలలో కొనుగోలు చేసే షేర్లను తిరిగి అమ్మడం కూడా కష్టతరమయ్యే పరిస్థితి ఏర్పడుతున్నది. కంపెనీలు విడుదల చేసే ప్రీమియం మొత్తాలకు, ఇష్యూ తర్వాత ఆ షేర్లకు లభిస్తున్న మార్కెట్ ధరకు పొంతన వుండడం లేదు. చాలా కంపెనీలు అధిక ప్రీమియం ధరకు షేర్లు విడుదల చేస్తున్నాయి వీటిని తిరిగి అదే ధరకు అమ్మడం కష్టంగా వుంది. గత ఒకటి, ఒకటిన్నర సంవత్సరంలో పబ్లిక్‌కు వచ్చిన వందలాది కంపెనీలలో సగం పైన లిస్ట్ అయినప్పటికీ ట్రేడ్ కావడం లేదు. ఈ పరిస్థితిలో ఎంత మంచి కంపెనీ అయినా ప్రీమియం అధికంగా నిర్ణయించిన కొత్త షేర్ల జోలికి పోకుండడం మంచిది.

సెకండరీ మార్కెట్‌లో స్తబ్దత వల్ల ఈ ప్రీమియం ధరలు వాటంతటవే తగ్గి పోయే అవకాశం వుంది. చాలా మంది ఇష్యూ తేదీలను వాయిదా వేసుకొంటున్నారు. పెద్ద కంపెనీలు కూడా ప్రీమియం తగ్గించే ఆలోచనలో వున్నాయి.

ఈ పరిస్థితిలో షేర్ మార్కెట్‌లో వ్యాపారం చేసే సాధారణ పెట్టుబడి దారులు ఎంతో జాగ్రత్తగా వ్యవహరించడం శ్రేయస్కరం. షేర్లు కొనేటప్పుడు లాభాలకు అధిక ప్రాధాన్యత ఇవ్వకూడదు. ముందుగా సెక్యూరిటీ, తర్వాత క్యాపిటల్ అప్రిషియేషన్, ఆ తర్వాత లిక్విడిటీ, అటు పిమ్మటే లాభాలకు ప్రాధాన్యత ఇవ్వాలి. స్వల్ప కాలంలో లాభాల దృష్టితో కాకుండా, ఒకటి నుంచి 3 సంవత్సరాల దీర్ఘ కాలంలో ఫలితాల కోసం పెట్టుబడి పెట్ట గల్గితే షేర్ల వ్యాపారం మంచి లాభాల నివ్వగలదు.

కాల్గేట్ విషయమే చూద్దాం. 1980 లో 86 రూపాయల లెక్కన 100 షేర్లుకొని 8600 లు పెట్టుబడి పెట్టి, తిరిగి అమ్మకుండా దాచి వుంచుకొన్న వారికి ఈ రోజు వాటి

> లాభం అంచనాకు చివరి ప్రాధాన్యత; భద్రతకు మొదటి పరిగణన ఇస్తే తప్ప షేర్ల వ్యాపారం రిస్కే!

విలువ 35 లక్షలు లభిస్తున్నది. రానున్న రెండు, మూడేళ్లలో ఇది మళ్లీ రెట్టింపైనా ఆశ్చర్యం లేదు. 1986 - 87 లలో రెడ్డి లేబరేటరీస్ పైన రూ. 3000 పెట్టుబడి ఈ రోజు లక్షల విలువ సంతరించు కొన్నది. 1990 లో మద్రాసు సిమెంట్ పైన 5 పెట్టుబడి ఈ రోజు రెండున్నర లక్షల విలువ పొందింది. క్రమం తప్పకుండా బోనస్ ఇవ్వడం; కంపెనీలు మంచి యాజమాన్య పద్ధతులు పాటించడం వల్ల షేర్ల ధరలు నిలకడగా పెరగడం వంటి కారణాల వల్ల ఈ షేర్ల విలువలు ఇట్లా పెరిగాయి. బాగా ఆలోచించి తొందర పడకుండా కనీసం మూడేళ్ల కొకసారి బోనస్, ఏడాదికి ఇరవై శాతం తగ్గని అమ్మకాల అభివృద్ధి, క్రమం తప్పకుండా రైట్స్ ఇష్యూ ఇచ్చే కంపెనీలను ఎంపిక చేసుకొని పెట్టుబడి పెట్టడమే ఈనాటి అవసరం.

# అదుపులేని అరాచకం

రాష్ట్రంలో హింస, దౌర్జన్యాలు పెచ్చు పెరిగి పోతున్నాయి. ఇటు రాజకీయ వాదులు, అటు పోలీసులు అదుపు తప్పి ప్రవర్తిస్తున్నారు. ప్రభుత్వ మనికి ఒకటుందన్న స్పృహ, చట్ట బద్ధ పరిపాలన పట్ల గౌరవం అందరిలో లోపిస్తున్నాయి. బీహారు, ఉత్తర ప్రదేశ్ వంటి రాష్ట్రాలలో కన్పించే ఆటవిక రాజ్యం, అనాగరిక హింసోన్మాదం ఆంధ్ర రాష్ట్రానికి దిగుమతౌ తున్నాయి. తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన ఈ మూడు నెలల్లోనే అరాచక శక్తులు విజృంభించడం ప్రత్యేకంగా గమనించాల్సిన విషయం.

అనంతపురం జిల్లా చెన్నేపల్లి గ్రామంలో 26 తేది ఉదయం రోడ్డు పై మందు పాతరలు పేల్చి 8 మంది కాంగ్రెస్ వారులను దారుణంగా చంపారు. ఈ దారుణానికి ఒడిగట్టిన తెలుగు నాయకులలో ఒకరు కూడా ఎగిరి పడిన జీపు శకలాలు తగిలి మరణించారు. మందు పాతరలు పీపుల్స్ వార్ నక్సలైట్లకు పరిమితమై వుండేవి. వాటినిప్పుడు గ్రామ స్థాయి ముఠా కక్షలు తీర్చు కోవడానికి ప్రయోగించడా రంటే రాయలసీమ రాజకీయ వాదుల రక్త దాహం ఎంత రాక్షస ప్రాయంగా పెరిగి పోయిందో అర్థం చేసుకోవచ్చు. కేవలం నక్సలైట్ల వంటి సుశిక్షితులైన, గెరిల్లా యుద్ధ పటిమ కల్గిన తీవ్రవాదులు మాత్రమే వాడుతుండిన మందు పాతరలు, రిమోట్ కంట్రోలు బాంబులు గ్రామ నాయకులకు ఎట్లా వచ్చాయన్నది మిస్టరీ. అనంతపురం జిల్లా తెలుగు నాయకుడు, కార్మిక మంత్రి శ్రీ పరిటాల రవి, మాజీ నక్సలైట్ కావడం; మరణించిన వారు ఆయన ప్రత్యర్థులు కావడంతో సహజంగానే నేర సందేహం ఆయన పైకి ప్రసరిస్తున్నది. తెలుగుదేశం ప్రభుత్వం దీని పై వివరణ ఇవ్వలేక పోవడం మరీ ఆందోళన కల్గించే విషయం.

శ్రీకాకుళం జిల్లా, మబగాం గ్రామంలో ఎన్నికల కక్షలు దౌర్జన్యాలకు, దాడులకు దారి తీసి, పరిస్థితి అదుపు తప్పి, పోలీసు కాల్పులలో ఐదుగురు మరణించారు. హైదరాబాదు పాత బస్తీలో పరీక్షల్లో కాపీ కొడుతున్న ఒక విద్యార్థిని అరెస్టు చేయడం ఉద్రిక్తతకు దారి తీసి, పోలీసు స్టేషన్‌లోనే ఆ విద్యార్థి తూటాలకు బలై పోయాడు. ప్రజలు పోలీసు స్టేషన్‌ను ధ్వంసం చేశారు. తమ స్టేషన్‌లో ఒక విద్యార్థి తమ పై తిరగ బడితే, అదుపులోకి తీసుకోవడం చేత కాక, తుపాకితో కాల్చి పారేయ వలసిన పరిస్థితి ఏర్పడిందంటే పోలీసుల్లో ఎంతటి శిక్షణా లోపం వుందో అర్థం చేసుకోవచ్చు. అందరు పోలీసులు కలిసి, పదహారేళ్ల వయస్సులోని పిల్లవాణ్ని అదుపు చేయ లేక పోయారా? ఆ పిల్లవాడు తెగించి తమ చేతిలోని తుపాకి పెరుక్కొని తమ పైకే ఎక్కు పెడుతుంటే ఎందుకు నివారించ లేక పోయారు?

మహబూబ్ నగర్‌లో స్థానిక ఎమ్మెల్యే ఎర్ర సత్యం కౌంటింగ్ కేంద్రం దగ్గరకు త్రాగి వచ్చి తమను దుర్భాష లాడాడని పోలీసులు అతడి పైన, అతడి అనుచరుల పైన రాళ్లు రువ్వి రౌడీ మూకల వలె ప్రవర్తించారు. సాధారణ సిబ్బంది నుంచి, ఉన్నతాధి కారుల వరకు పోలీసు శాఖలో పెరిగి పోతున్న క్రమ శిక్షణా రాహిత్యానికి, అసహన భావాలకు ప్రతి రూపం ఈ దుర్ఘటన. అధికార పార్టీకి చెందిన ఒక ఎమ్మెల్యే పట్ట పగలు తాగి, ప్రజల మధ్యకు వచ్చాడంటే రాష్ట్రంలో మద్య నిషేధం ఎంత గొప్పగా అమలౌ తున్నదో అర్థం చేసుకోవచ్చు.

విజయవాడలో ఎమ్మెల్యే శ్రీ రత్నకుమారి తనను చంపడానికి బాంబులు తెచ్చి, వాటిని కొండలపై ప్రయోగించి ట్రయల్ చూశారని ఆరోపించారు. చిత్తూరులో, అక్కడి శాసన సభ్యుడు శ్రీ సి.కె. బాబు తన ప్రాణాలకు ప్రమాదం ఏర్పడిందని, రక్షణ కల్పించాలని స్పీకర్‌ను వేడుకున్నారు; అనంతపురం నాయకుడు, మాజీ మంత్రి శ్రీ జె.సి. దివాకర్ రెడ్డి నేరుగా మంత్రి పరిటాల రవి తనను చంపను కుట్ర పన్నుతున్నాడని, తన ప్రాణాలు కాపాడాలని మొరపెడుతున్నారు.

రాష్ట్రంలో అదుపు తప్పుతున్న అరాచక పరిస్థితులకు ఈ సంఘటన లన్నీ అద్దం పడుతున్నాయి. మాజీ మంత్రులు, ఎమ్మెల్యేల ప్రాణాలకే రక్షణ లేని పరిస్థితి ఏర్పడితే; అధికార పార్టీ ఎమ్మెల్యే పైనే పోలీసులు రాళ్లు రువ్వి దౌర్జన్యం చేస్తే; పోలీసు స్టేషన్ లోనే ఎన్‌కౌంటర్లు జరిగి పోతుంటే ఇక సాధారణ ప్రజానీకానికి రక్షణ ఎక్కడ వుంటుంది? ప్రభుత్వం వారినెల్లా కాపాడ గల్గుతుంది?

రాజకీయాలలో నేర చరిత్ర కల్గిన వారికి, హంతకులుగా ముద్ర పడిన వారికి టిక్కెట్లిచ్చి గెల్పించడమే కాక, మంత్రి పదవులతో సత్కరించడం వల్లనే ఇటువంటి హింసోన్మాదం పెరిగి పోతున్నదనడం నిజం. ప్రభుత్వం ఇప్పటికైనా కళ్లు తెరచి ఈ అరాచకాన్ని కఠినంగా అణచి వేయకుంటే రాష్ట్రంలో శాంతి భద్రతలు మృగ్యమై పోతాయి. ప్రతి గ్రామం ఒక రక్తపు మడుగుగా మారుతుంది.

## 50 ఏళ్లక్రితం ఈవారం

జమీన్‌రైతు

30 - 3 - 1945

పేజీలు : 8 వెల: 0-1-6

### 'నా ఆయుర్దాయం 125 సంవత్సరాలు' గాంధీజీ ఆశయం

"125 సంవత్సరాల వయస్సు వరకు జీవించాలని నా ఆశ. నేనీ మాట నవ్వులకు చెప్పడం లేదు. చికిత్సలు పొంది వైద్యుల సహాయంతోకన్న, సత్య, అహింసలను దివ్యౌషధముల సేవించుచూ 125 సంవత్సరాలు బ్రతకాలని నా అభిమతం". అని గాంధీజీ సేవాగ్రామంలో 25తేది ఖాదీ విద్యాలయ ప్రసంగంలో అన్నారు.

### తంబూలాన్ని చూచి వ్యాధిని కనుక్కొన్న ఘనుడు

పూర్వం నెల్లూరు తాలూకా ఇందుకూరుపేట, గాడేపల్లి సుబ్బాభట్లుగారి గురువు, మద్రాసులో బలిజ, గాజుల లక్ష్మణశెట్టిగారి ఇంట వైద్యుడుగా వుండేవాడట. ఒకనాడు గురువు, శిష్యుడు క్రిందవీధిన పోతుండగా మిద్దెమీద నుండి లక్ష్మణశెట్టిగారు తాంబూలంవేసి తమ్మ ఉమిశాడట. గురువుగారది చూసి శెట్టిగారికి పుంస్త్వం పోయిందన్నాడట శిష్యుడితో. మరురోజు అప్రసంగంలో శెట్టిగారితో ఈ విషయం ప్రస్తావించి 4 మాసాల లోపల పలాని మాంసం తిన్నావా అని అడిగాడట. శెట్టిగారు ఔననగా, కట్టయితే దానికి విరుగుడు పలానిమాంసం తినమని చెప్పాడట. సాయంత్రం శెట్టిగారు భార్యను వైద్యుడితో యీవిషయం చెప్పావా అని అడిగాడట. ఆమె కుయ్యో మొర్రో నేనెరగనన్నదట. తర్వాత వైద్యుడే మీరు తాంబూలంవేసిన తమ్మ చూచి కనుక్కున్నా నన్నాడట. తర్వాత వైద్యుడు చెప్పిన మాంసం తినడం శెట్టిగారికి యథాప్రకారం ఆరోగ్యం కలగడం జరిగిందట. ఈ విషయం సదరు గాడేపల్లి సుబ్బాభట్లుగారివల్ల తాను విన్నట్లు గునుపాటి యానాదిరెడ్డిగారు చెప్పిరి. చూడారా పూర్వం ఎంతటి ప్రతిభావంతు లుండేవారో.

### నెల్లూరు ముచ్చట్లు

సుదర్శనమ్మ మహిళాసభ వార్షికోత్సవంలో కలెక్టరు వర్గీస్‌గారి ఉపన్యాసం ఆనాటి టీ పార్టీకి కొంచెం తియ్యగా వుంటే బాగుండేది.-

* * *

### నెల్లూరు బజారుధరలు

| | | | |
|---|---|---|---|
| *తెమొలగొలుకులు | 150 | 0 | 0 |
| కొత్త మొలగొలుకులు | 142 | 0 | 0 |
| ఉలవలు తూము1-కి | 12 | 0 | 0 |
| పిల్లిపెసర | 10 | 0 | 0 |
| పెసలు | 18 | 0 | 0 |
| మినుములు | 20 | 0 | 0 |
| కందులు | 20 | 0 | 0 |
| బంగారు సవర (మద్రాసుధర) | 50 | 4 | 0 |

## జనవాణి

# బడుగు వర్గాల వారు తమ ప్రతిభ నిరూపించుకోవాలి!

డిసెంబర్‌లో జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో ఊహించిన విధంగా తెలుగుదేశం పార్టీ అత్యధిక స్థానాలు కైవసం చేసుకొన్నది. ఆ తర్వాత మూడు నెలలకే జరిగిన స్థానిక ఎన్నికల్లో ఆ పార్టీకి ఎదురు దెబ్బ తగలడం కూడా ఊహించని పరిణామమే. ఇంతకు ముందు ఎన్నికలవలె రిగ్గింగు గాని, దొంగ ఓట్లు పోల్ గావడం కానీ ఈసారి తక్కువే. కాని ఒకసారి తెలుగుదేశానికి ఓట్లు వేసిన ప్రజలే మరొకసారి కాంగ్రెస్ తదితర పార్టీలకు ఓట్లు వేయడమే విశేషం. పరిపాలనా సౌలభ్యం కోసం కేంద్ర ప్రభుత్వం తెచ్చిన చట్టంద్వారా రిజర్వేషన్లను వినియోగించుకొని చాలా మంది ఎస్.సి, ఎస్.టి, బిసి అభ్యర్థులు ఎన్నికల రంగంలోకి దిగడం, గెలవడం జరిగింది. అయితే పరిపాలన 'పేరిగాని దర్బారు' గానో లేదా 'తిప్పడి' పాత్రగానో వుంటుందా అన్నదే సందేహంగా వుంది. బడుగు వర్గాల చేతికి అధికారం రావడం అభినందించ దగ్గ విషయమే. నిరక్షరాస్యులు, పరిపాలనకు క్రొత్తవారు చంచల బుద్ధి లేకుండా ముక్కు సూటిగా పరిపాలన నిర్వహిస్తారని ఆశిద్దాం.

కోవూరు. -అనుపమ.

### దటీజ్ జమీన్‌రైతు!

అసెంబ్లీ ఎన్నికలప్పుడు నెల్లూరు టౌన్ నియోజక వర్గానికి టి. రమేష్‌రెడ్డి గెలుపును, మున్సిపాలిటీకి ఆనం వివేకానందరెడ్డి గెలుపును జమీన్‌రైతు ఊహించి వ్రాయడం, అది నిజం కావడం అభినందనీయం. హస్తవాసివలె మీ 'కలంవాసి' పనిచేస్తున్నట్లు నిపిస్తుంది. ఏమైనా ప్రతి ఎన్నికల్లో మీ అంచనా నిజమై జమీన్‌రైతు ఖ్యాతి మరింత పెరుగుతున్నది.

నెల్లూరు. -సి. నారాయణరావు.

### ప్రజలు గొర్రెలుకారు!

ఎన్టీఆర్ వందరోజుల పాలన పూర్తి చేసుకొన్నరోజు పత్రికల వారిని పిలిపించి తాను అధికారంలోకి రాకమునుపు చేసిన వాగ్దానాలను నెరవేర్చినట్లు చెప్పారు. కాని ప్రభుత్వ పరిపాలనలో ముఖ్యమంత్రిగా ఎన్టీఆర్ జోక్యం తగ్గిపోయి ఆయన శ్రీమతి లక్ష్మీపార్వతి జోక్యం అధికమయ్యింది. అందువల్లే ప్రజలు కార్పొరేషన్, మునిసిపల్ ఎన్నికల్లో తమ సత్తా చాటారు. ఎన్టీఆర్ పదేపదే రెండు రూపాయల బియ్యం గురించి చెబుతారు. ఆపథకాన్ని ఆపిన అరుగంటలో ఆయన ప్రభుత్వం పడిపోతుందని ఆయనకు తెలుసు. మద్యం నిషేధం విధించారు గాని మొన్న తిరుపతి పర్యటనకు ఆయన అభిమానియైన ఉద్యోగి తాగివచ్చి నానా రభస చేస్తే శిక్షించక వదిలేశారు. ఆ పార్టీ ఎమ్మెల్యే ఎన్నికల కేంద్రానికి తాగి వచ్చి బీభత్సం సృష్టిస్తే ప్రతిపక్షాలు రచ్చ భరించలేక చివరికి సస్పెండ్ చేశారు. ఈ రెండు తాగుడు సంఘటనలు రాష్ట్రంలో ప్రొహిబిషన్ చట్టం ఎంత చక్కగా అమలు అవుతున్నదీ చాటి చెబుతున్నాయి. విద్యుత్ కోతతో ప్రజలు అల్లాడి పోతున్నారు. రాష్ట్రం ఎన్నో సమస్యలతో సతమతమై పోతుంటే తాను ఢిల్లీ రాజకీయాల వైపుకు వెళ్లి రాష్ట్రాన్ని ప్రియ సతీమణికి వదలాలనే ఆలోచనలో ఎన్టీఆర్ వున్నట్లున్నారు. అందువల్లే నూరురోజుల్లోనే జరిగిన మండల పరిషత్, జిల్లాపరిషత్ ఎన్నికల్లో తగిన బుద్ధి చెప్పి తాము గొర్రెలు కామని చాటి చెప్పారు ప్రజలు. ఎన్టీఆర్‌ను రాష్ట్రానికే పరిమితమవ మన్నారు.

నెల్లూరు. -ధూర్జటి.

### నూరేళ్లనాడే నెల్లూరు మునిసిపాలిటీలో పదవీ కీచులాటలు, కౌన్సిల్ రద్దు!

# శతజయంతి ఇప్పుడైనా జరిపించండి!

ఆంధ్రదేశంలోని వేళ్ళమీద లెక్కించదగిన పురాతన పురపాలక సంఘాలలో నెల్లూరు మునిసిపాలిటీ కూడా ఒకటి. గిరీశంగారన్నట్లు పూజా పునస్కారాల్లేక బూజుపట్టి పోయింది గాని, లేకపోతే ఈపాటికెప్పుడో శతజయంత్యుత్సవం జరుపుకొని వుండాల్సింది- వైభవోపేతంగా.

మద్రాను పట్టణాభివృద్ధి చట్టం (Madras Town Improvement Act of 1855) క్రింద, 1866 నవంబరు 1తేదిన నెల్లూరు మునిసిపాలిటీ పుట్టింది. అంటే 126 సంవత్సరాల క్రితమన్నమాట. ఆ తొలిదశలో జిల్లా కలెక్టరు ఎక్స్ అఫిషియో ప్రెసిడెంట్‌గా మునిసిపాలిటీ మీద పెత్తనం చేస్తుండేవారు. అప్పట్లో కౌన్సిల్‌ను 'కమీషన్' అని; కౌన్సిలర్లను 'కమీషనర్ల' ని పిల్చేవారు. ఆనాటి జిల్లా కలెక్టర్లు టి వార్డి హార్డింజ్, జి. వాన్స్ఆగన్యూ, ఎఫ్.ఆర్.హెచ్. షార్ప్, జె. గ్రోస్, జె. లివారెన్స్ వగైరాలు మునిసిపల్ ప్రెసిడెంట్లుగా వ్యవహరించారు.

తర్వాత 1885 ఏప్రిల్ 1 తేదిన తొలిసారిగా నెల్లూరును మద్రాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల చట్టంక్రింద చేర్చి, పద్దెనిమిది మంది సభ్యులున్న కౌన్సిల్‌కు ఛైర్మన్‌ను ఎన్నుకునే హక్కు కల్పించారు. దాంతో మునిసిపాలిటీమీద కలెక్టరు పెత్తనం పోయింది; అన్నిటికీ ఛైర్మనే బాధ్యుడయ్యాడు. ప్రెసిడెంట్ అనేపేరు పోయి, ఛైర్మన్; కమీషనర్లనేపేరు పోయి, కౌన్సిలర్లు వచ్చారు.

కలెక్టరుకు మునిసిపల్ ప్రెసిడెంటు పదవి పోయిన తర్వాత,

## గత చరిత్రలో ఘనతర ఘట్టాలు కొన్నే!

పాత చట్టం క్రింద వైస్ ప్రెసిడెంట్‌గా వుండిన హుజూర్ సిరస్తదారు టోకు జయరాం నాయుడు ఛైర్మనై, దాదాపు రెండేళ్ళు ఆ పదవిలో కొనసాగాడు. ప్రభుత్వ నియామకమే అయినా, నెల్లూరు మునిసిపాలిటీమీద పెత్తనం చేసిన మొట్ట మొదటి భారతీయుడు జయరాంనాయుడే.

తర్వాత 1887 ఆగస్టులో తొలిసారిగా ఎన్నికలు జరిగాయి; కాసుభొల రామారావు ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. రామారావు గారు ఛైర్మన్‌గా వున్నది మూడు నెలలే అయినా, నెల్లూరు మునిసిపాలిటీకి తొలి ఛైర్మన్‌గా ఆయన చరిత్రలో కెక్కాడు; నెల్లూరు మునిసిపాలిటీ పితామహుడని పించుకున్నాడు. మునిసిపాలిటీ ఏర్పడి 126 ఏళ్లయినా, ఎన్నికైన కౌన్సిల్ ఏర్పడింది 1887 లో కాబట్టి దానికిప్పుడు 107 ఏళ్ల మాత్రమేనని భావించాలి.

1887 నవంబరులో కాసుభొల రామారావుగారి పదవీకాలం పూర్తయిపోయిన తర్వాత ఎవరు ఛైర్మన్‌కావాలన్నదొక పెద్ద వివాదమైంది. కౌన్సిలర్లు తమలో తాము కీచులాడుకోవడం మొదలు పెట్టారు. ఎన్నిసార్లు సమావేశం ఏర్పాటు చేసినా కోరం లేకుండా చేస్తుండేవారు. కడకు విసిగి 1888లో ఛైర్మన్‌ను ఎన్నుకొనే హక్కు కౌన్సిల్‌కు రద్దు చేసింది ప్రభుత్వం. వెంటనే 1888 ఏప్రెల్ 12 తేదిన అసిస్టెంట్ కలెక్టర్ ఇ. స్కాట్‌ను మునిసిపల్ అధ్యక్షుడుగా నియమించారు. పురిటిలోనే సంధికొట్టినట్లు, పుట్టుకతోనే నెల్లూరు మునిసిపాలిటీ రాజకీయ కీచులాటలను ఉగ్గుతో అబ్బిన విద్యగా నేర్చుకున్నదన్నమాట. హెచ్చుతక్కువ ఒక సంవత్సరం ఈ "ఎమర్జెన్సీ" కొనసాగిన తర్వాత 1889లో ఛైర్మన్‌ను ఎన్నుకొనే హక్కును పునరుద్ధరించారు. తర్వాత 1890 ఫిబ్రవరి 2తేదిన రెండవ ఎన్నికలు జరిగాయి; న్యాయవాది వి. ఆదినారాయణయ్య ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు.

ఐతే ఆదినారాయణయ్య పాలన కూడా ఎక్కువకాలం సాగలేదు. మునిసిపల్ ఛైర్మన్‌ను, కౌన్సిలర్లను ప్రభుత్వమే నియమించాలని 1890 డిసెంబరు 8 తేదిన వచ్చిన ఉత్తర్వుననుసరించి, ఆదినారాయణయ్య గారు పదవినుంచి వైదొలగక తప్పలేదు. అప్పటివరకు ప్రభుత్వం మంజూరుచేసిన 18 కౌన్సిలర్ స్థానాలకు గాను మునిసిపల్ రేట్ పేయర్లు తొమ్మిది మందిని ఎన్నుకొనేవారు; ఆ 9 మంది కౌన్సిలర్లు కలిసి ఛైర్మన్‌ను ఎన్నుకొనేవారు. 1890 డిసెంబరు 12తేదినాటి గవర్నర్ ఉత్తర్వుతో ఈ హక్కులన్నీ నామరూపాల్లేకుండా రద్దయిపోయి, ఛైర్మన్‌ను నియమించే అధికారం ప్రభుత్వానికి తిరిగి సంక్రమించింది. అప్పుడు మళ్ళీ కాసుభొల రామారావుగార్ని జీతంమీద ఛైర్మన్‌గా ప్రభుత్వం నియమించింది. ఆయన 1891 ఆగష్టు 1తేదిన ఛైర్మన్‌గా చార్జితీసుకొని దాదాపు నాలుగేళ్ళు ఆ పదవిలో కొనసాగారు. తర్వాత మునిసిపాలిటీ పెత్తనమంతా అధికారుల హస్తగతమైంది. 1895 జనవరి 23 తేదిన డాక్టర్ సి.జె. సల్డానాను ఛైర్మన్‌గా నియమించారు. ఆయన రెండు నెలలుండి సెలవు పెట్టారు; అప్పుడు ఎన్. సూర్యనారాయణ రావు పంతులు ఛైర్మన్‌గా వ్యవహరించారు. తిరిగి నవంబరులో సల్డానావచ్చి చార్జి తీసుకొని, డిసెంబరులో ఊటీకి అడిషనల్ మెడికలాఫీసరుగా బదలీ అయ్యేదాకా ఛైర్మన్‌గా వున్నారు. ఆయన ట్రాన్స్‌ఫర్ తర్వాత ఆర్.డి.ఓ చార్జి

కొరవ 18 పేజీలో

జనజీవన మతి కష్టం; జన నష్టమపారం; సుఖశాంతులు పూజ్యం;
ధన దుర్వినియోగ మధికం; కామాంధత సర్వ వ్యాపితం;
అదుపు చేయలేని అరాచకం; ప్రకృతి వైపరీత్యాల వినాశనం!

# 'యువ'లో అన్నీ దుష్ఫలితాలే!

యువనామ సంవత్సరం ప్రవ మొదలైన 60 సంవత్సరాలలో 9వది. ఇది విష్ణు అంశత్రయంలో మూడవది. "యువాస్యాత్ తరుణో స్రష్టిః నిసర్గ బలశాలిని" అని ఈ సంవత్సరాన్ని నిర్వచిస్తారు. ఇది బ్రహ్మ దేవతా రూపంగా వేదాలలో స్తుతించ బడింది. చంద్రమాన పరిధిలో యువ సంవత్సరం, సౌరమానంచే 14.4.94 నుండి యువనామ సంవత్సరం జరుగుతుంది. వింధ్యకు ఉత్తర ప్రదేశంలో బార్హస్పత్య మానంచే 19.7.1995 వరకు సర్వజిత్ సంవత్సరం. తదుపరి సర్వధారి సంవత్సరం. ఇది కలియుగాది సౌరాబ్దాలలో 5096 సంవత్సరం మరియు ఫసలీ 1404 - 1405.

## యువ సంవత్సర ఫలం

కామాధిక్యత కలిగి, గోధుమ, సన్న ధాన్యాలు చెరకు ఫలాల ఉత్పత్తి పెరుగుతుంది. అరాచక మధిక మవుతుంది. యువతకు ప్రాముఖ్యత, వ్యాధుల వల్ల ప్రకృతి వైపరీత్యాల వల్ల వినాశనం ఎక్కువగా ఉంటుంది. ధరలు బాగా పెరుగుతాయి.

## నవనాయక ఫలితం

ఈ సంవత్సరం రాజు శని, మంత్రి శుక్రుడు, సేనాధి పత్యం మేఘార్ఘాలకు అధిపతి గురువు, సస్యాధిపతి చంద్రుడు, ధాన్యాధి పతి శని, రసాధిపతి బుధుడు, నీరసాధిపతి చంద్రుడు. నవ నాయకులు సంక్రమణ వారాధి పతులను ఆర్ద్ర కార్తె కారాధి పతులని శాస్త్ర నిర్దేశం. నవ నాయకులలో 7 శుభులు, 2 పాపులు. గురువుకు 3; శనికి 2; చంద్రునకు 2; బుధ శుక్రులకు చెరొకటి ఆధిపత్యం లభిస్తున్నాయి.

సంవత్సరాధిపతి శని యగుట వల్ల అనియత, అకాల వర్షాల వల్ల రోగ బాధలు ఎక్కువగా ఉంటాయి. ప్రభుత్వ నిర్వహణలో లోటుపాట్లు, అధినేతల మధ్య బేధాభిప్రాయాలు, విరోధ భావాలు ఎక్కువగా ఉంటాయి. ప్రకృతి వైపరీత్యాల వల్ల జననష్టం ఎక్కువగా వుంటుంది.

మంత్రి శుక్రుడగుట వల్ల "కామం" అధికంగా వుంటుంది. పండ్లు బాగుగా ఫలిస్తాయి. పాల దిగుబడి బాగా వుంటుంది.

సేనాధిపతి గురువగుట వల్ల యజ్ఞయాగాదులు సత్కర్మలు చేయుట, ధర్మ కార్యాలు జరుగుతాయి. యుద్ధాలు జరగవు. ధాన్యాధిపతి శని అవడం వల్ల నల్లరేగడి నేల లందలి పంటలు బాగా పండును. నలుపు రంగు ధాన్యాలు, సన్నటి ధాన్యాల ఉత్పత్తి బాగుంటుంది.

మేఘార్ఘాధిపతి గురవగుట వల్ల పంటల ఉత్పత్తికి తగిన వర్షాలు కురుస్తాయి. సకాల వర్షాలు వుంటాయి. ధరలు పెరుగుతాయి. వింధ్యకు ఉత్తర ప్రాంతాన వర్షమధికమై జల ప్రళయాలు

> **పంచాంగ శ్రవణం**
> స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.

సంభవిస్తాయి. సస్యాధిపతి చంద్రుడగుట వల్ల మెట్ట మాగాణి భూముల నుండి పంటల ఉత్పత్తి బాగుంటుంది. చాంద్రమాన ప్రాంతాన తెగుళ్ళు ఏర్పడుతాయి. ఆలవరాల ఉత్పత్తికి (చేపలు, రొయ్యలు మొదలైనవి) దెబ్బ తగులుతుంది.

రసాధిపతి బుధుడగుట వల్ల రస వస్తువులు, ఇంగువ, ఉల్లిపాయలు, నూనెలు, నెయ్యి, కిరస నాయిలు, పంచదార, బెల్లం ధరలు విపరీత మౌతాయి.

నీరసాధిపతి చంద్రుడగుట వల్ల లోహాల ధరలు, ముత్యాలు, రత్నాలు, బంగారు వస్త్రాలు, ఆభరణాల ఉత్పత్తి పెరిగినా ధరలు కూడా పెరుగుతాయి.

## వర్షలగ్న జగల్లగ్నాలు - ఫలితాలు

వర్ష లగ్నం మేషమైంది. భాగ్యాధిపతి గురువు అష్టమ స్థితి వల్ల రాజకీయ వైపరీత్యాలు జరిగి ఉత్తర రాష్ట్రాలందు కొన్ని ప్రభుత్వాలు పతన మౌతాయి. దేశ వాయువ్యాలు మారవు. లగ్నమున కేతువుండుట వల్ల కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రారంభించిన కొన్ని మంచి పనులు నిలబడి పోతాయి. సప్తమాన రాహు వుండుట వల్ల భిన్న రాజకీయ పార్టీల మధ్య పార్టీ నేతల మధ్య తగాదా లుంటాయి. రాజ్యలాభాధి పతి శని లగ్నాన్ని చూచుట వల్ల ద్వితీయ సప్తమాధిపతి శుక్రునితో సంబంధం కలిగి వుండడం వల్ల తూర్పు పశ్చిమ దేశాల నుండి మన ప్రభుత్వానికి ఆర్థిక సహాయం బాగుండును. ఆర్థిక సంస్కరణలు కొనసాగి పోతాయి. లగ్నానికి వ్యయమున బుధ రవి చంద్రు లుండుట వల్ల ధన దుర్వినియోగం వుంటుంది. లగ్నాధిపతి కుజుడు చతుర్థం నుండి నీచ భంగ యోగ కారకుడగుట వల్ల మన రాష్ట్రంలో, కేంద్రంలో ప్రభుత్వాలు మారవు. కాని ప్రభుత్వ నేతలు అపనిందల పాలవుతారు. ప్రభుత్వ నిర్ణయాలు అస్థిరంగా వుంటాయి. జగలగ్నమున మిధున, లగ్నాధిపతి బుధుడు దశమ కేంద్రాన నీచరాశి యందుండి గురువుచే చూడబడుచు నీచ భంగం నొందుట వల్ల ప్రభుత్వాలు ( కేంద్ర, రాష్ట్ర) స్థిరంగా వుండి సమస్యలను దక్షతతో ఎదుర్కొంటాయి. శని శుక్రులు నవమ కోణంలో వుండి కుజునిచే చూడ బడడం వల్ల సప్తమ రాజ్యాధిపతి గురువునకు షష్టస్థితి వల్ల ఇండోనేషియా, లంక, మాల్దీవులలోను, యూరప్ ప్రాంతాలలో విశేషంగా రక్త పాతం జరిగి ప్రభుత్వ నేతలు పాత మవడం జరుగుతుంది. వర్ష జగలగ్నాలందు చంద్రుడు వ్యయ చతుర్థ లందుండుట వల్ల జల ప్రళయాలు, ప్రకృతి వైపరీత్యాలు కలుగుతాయి. కుంభరాశి యందు గల శుక్రుడు శని కుజాల సంబంధం కల్గి యుండుట వల్ల పరస్పర హత్యలు, వాహన ప్రమాదాలు ఎక్కువగా ఉంటాయి.•

## ఆర్ద్ర కార్తె ప్రవేశం

22.6.95 తేది గురువారం రాత్రి 8.20 గంటలకు ఆర్ద్ర కార్తె రవి

(కారవ19 పేజీలో)

# మొల్ల రామాయణ వైభవం - మల్లెల సౌరభాల సామ్యం!

సాహిత్య సదస్సు యాజ మాన్యంలో మొల్ల జయంతి సభ రేబాల పట్టాభి రామిరెడ్డి పఠన మందిరంలో జరిగింది. వేణుగోపాల స్వామి డిగ్రీ కళాశాల తెలుగు లెక్చరర్ శ్రీమతి పి. వసుంధర అధ్యక్షత వహించి మాట్లాడారు. ఆంధ్ర సాహితీ లోకంలో కవయిత్రుల సంఖ్య బహు తక్కువ; వారిలో జనాదరణ పొందిన కవయిత్రి మొల్ల నెల్లూరు ప్రాంతీయురాలు కావడం ముదావహ మన్నారామె. మొల్ల పేరుతోనే ఆమె రచించిన రామాయణం లోకంలో ప్రసిద్ధి పొందడం గొప్ప విషయమన్నారు. పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతి డాక్టర్ పి. కుసుమ కుమారి ప్రధానోపన్యాసం చేసారు. మొల్ల రామాయణ రచనా వైభవం, ఆంధ్ర కవితా లోకంలో చలనం లేని వున్నత స్థానాన్ని సంపాదించి పెట్టింది; ఆంధ్ర ప్రబంధాలు వ్యాఖ్యాన సహాయాలు లేనిదే పాఠకులకు అర్థం కావు; కానీ మొల్ల రామాయణం సాధారణ పాఠకుల నుంచి మహా పండితుల వరకు శ్రమ లేకుండా చదువుకొనే వీలున్నట్లు చెప్పారు. మల్లెల సౌరభాలు, మొల్ల రామాయణ వైభవాలు తెలుగుదేశంలో విశేష ఆదరణ పొందినట్లు వివరించారు. సభా రంభంలో డాక్టర్ సివి రామచంద్ర రావు వుపన్యాసకురాలిని సభకు పరిచయం చేసారు. సదస్సు వ్యవస్థాపకుడు గోనుకొండ వెంకట సుబ్బయ్య వందన సమర్పణతో సభ ముగిసింది.

## రక్తి కట్టిన నాటక పంచకం!

సుప్రసిద్ధ పౌరాణిక నటుడు పొన్నాల రామసుబ్బారెడ్డి ఆధ్వర్యంలో వెలుగొందుతున్న శ్రీరామకృష్ణ నాట్య మండలి 16 నుండి 20 తేది వరకు టౌన్ హాల్‌లో ప్రదర్శించిన పౌరాణిక నాటకాలు రక్తి కట్టాయి. రోజుకొక నాటకం చొప్పున భక్త రామదాసు, పాదుకా పట్టాభిషేకం, చిత్ర నళీయం, విషాద సారంగధర, సత్య హరిశ్చంద్ర నాటకాలు ప్రదర్శించారు. దేశమంతటా రెండువేలకు పై బడి ప్రదర్శనలిచ్చిన రామసుబ్బారెడ్డి రామదాసు, దశరథుడు, నలుడు, సారంగధరుడు, హరిశ్చంద్రుని పాత్రల్లో జీవించారు. ఎ. రఘురామయ్య, కోటేశ్వరీ దేవి, చంద్ర సేన, సుందర రామయ్య, సిద్ధేశ్వర రావు, దశరథ రామిరెడ్డి, మిగతా పాత్రల్లో రాణించారు. మొదటి రోజు సభకు సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాలురెడ్డి అధ్యక్షించారు. అగస్త్యరెడ్డి వెంకురెడ్డి ప్రారంభోపన్యాసం చేశారు. కార్య నిర్వహణలో సహకారా లందించిన ఎం. ధర్మారెడ్డి, గ్రిద్దలూరు గోపాల రావులను సన్మానించారు. సింహపురీయులకు కన్నుల పండుగగా, వీనుల విందుగా పౌరాణిక నాటక వైభవాన్ని సాక్షాత్కరింప చేసిన పొన్నాల అభినందనీయుడు.

## నెల్లూరు సంగతులు

### ఉగాది రోజు యాచేంద్ర గేయధార

వర్తమాన సమాజం యువనామ సంవత్సర ఉగాది ప్రత్యేక కానుకగా సంగీత గేయధార కార్యక్రమాన్ని 1 తేది పురమందిరంలో ఏర్పాటు చేస్తున్నది. సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాలురెడ్డి అధ్యక్షతన వెంకటగిరి మాజీ ఎమ్మెల్యే వి.బి. సాయికృష్ణ యాచేంద్ర గేయధార నిర్వహిస్తారు. వ్రచ్ఛకులుగా రాళ్లపల్లి సుబ్బలక్ష్మి, ఇలపావులూరి కామేశ్వరీదేవి, ఎం. విద్యుల్లత, జె.వి.ఎన్.ఆర్.ఎన్. ప్రసాద్, చింతా సుబ్బలక్ష్మి, డాక్టర్ సాయినాథ్, ఎమ్. గిరిజ పాల్గొంటారు. రచయిత మోనా, వయోలిన్ కళాకారుడు కె. వెంకట కృష్ణ, సంఘ సేవకురాలు జయా ఫిలిప్స్, రంగస్థల నటులు డి. హరగోపాల్, నృత్య కళాకారిణి వై. సుచిత్రలకు సమాజం ఉగాది పురస్కా రాలిస్తుంది. సాహితీ అభిమానులను తరలి రమ్మంటున్నారు సమాజం అధ్యక్ష

(కారవ19 పేజీలో)

# జిల్లాలో అతి ప్రాచీన గ్రామం ప్రభుగిరి పట్నం

(గత వారం కొరవ)

ఈ విధంగా నెల్లూరు జిల్లాలో క్రీ.శ. 13 వ శతాబ్దం నుండి క్రీ.శ. 200 సంవత్సరాల క్రితం వరకు సహగమనం జరిగిన అంశాలు మనకు లభ్యమయ్యాయి. వెలుగులోకి రాని ఎన్నో శాసనాలు ఇంకా సమాజంలో నిక్షిప్తమై వున్నాయి. భారత దేశంలో అన్ని ప్రాంతాలలో జరిగిన సామాజిక వున్నత సాంప్రదాయలతో పాటు దురాచారాలు కూడా ఈ ప్రాంతంలో చోటు చేసుకున్నాయని చెప్పేందుకు ఈ ఆధారాలు చాలు. యుగ ధర్మమనీ, సామాజిక కట్టుబాటనీ, ఆచారమనీ స్త్రీని హింసించే కాలం పోయింది. స్త్రీని స్త్రీగా గౌరవించే కాలం ఇది.

**నెల్లూరు చరిత్ర**

కొల్లూరి సాయిభక్తకేశవ
సాంకేతిక సహాయకుడు
పురావస్తుశాఖ, నెల్లూరు

చారిత్రక కాలంలో జరిగిన చేదు జ్ఞాపకాలను నెమరు వేసుకుంటూ, వర్తమాన కాలంలో స్త్రీ అభ్యున్నతికి, ఆమె వ్యక్తిగత వికాసానికి విలువను పెంచే మార్గంలో మనిషి దృక్పథం పయనించడం నిజంగా హర్షణీయం.

### దాసరి పల్లి - కృష్ణ గుహాలయం

దాసరి పల్లి గ్రామం ఉదయగిరి మండల కేంద్రానికి తూర్పున 8 కి.మీ. దూరంలో వుంది. ఈ గ్రామం చాలా ప్రాచీనమైనది. ఈ ప్రదేశంలోని పాటి దిబ్బలలో పరిశోధనలు జరిపి ప్రాచీన చారిత్రక కాలంనాటి కుండ పెంకులను

(కొరవ16 పేజీలో)

# స ణు గు డు

## * వైటి నాయుడు అంత ఉక్రోషం ప్రదర్శించడం వెగటుగా వుంది!

మునిసిపల్ ఎన్నికలలో తన ఓటమిని అంగీకరించలేక తెలుగుదేశం అభ్యర్థి శ్రీ వైటి నాయుడు సృష్టిస్తున్న హడావుడి వెగటుగా వుంది. ఎన్నికలలో జయాప జయాలు సర్వసాధారణం. రెండింటినీ సమంగా తీసుకోగలిగితేనే రాజకీయాలలో ఎక్కువ కాలం రాణించ గల్గుతారు. ఓడిపోయామన్న 'బాధ ఎవరికైనా సహజం. అందులోనూ వైటి ఓడింది కేవలం 46 ఓట్ల తేడాతో! పాతిక మంది చేత అదనంగా ఓటేయించుకొని వుంటే గెల్చివుండే వాడిని కదా అన్న ఆలోచన ఆయన మనసును పురిపెడుతుంది. ఈ కోణం నుంచి చూసినప్పుడు వైటి నాయుడి ఉక్రోషం అర్థం చేసుకోదగిందే! అయితే ఆ ఉక్రోషంలో విచక్షణ కోల్పోవడం, ఓటమిని గెలుపుగా తారుమారు చేయాలనుకోవడం దురదృష్టకరం. ఈ అల్లర్లతో వైటికి ప్రత్యక్ష సంబంధం లేకపోయి వుండవచ్చు. అంత అల్లరి చిల్లరిగా వ్యవహరించే తత్వమూ వైటిలో లేదు. కాని తన పేరుతో జరుగుతున్న దౌర్జన్యాలను తానే నివారించి వుంటే హుందాగా వుండేది.

దోలేంద్ర

ఆ తర్వాత కూడా వైటి దుడుకుగానే వ్యవహరిస్తున్నారు. ఆయన దాడి అంతా ఎమ్మెల్యే శ్రీ టి. రమేష్‌రెడ్డిపై మళ్లివుంది ఇప్పుడు. నెల్లూరు నుంచి ఇరవై బస్సుల్లో జనాన్ని తీసుకెళ్ళి అన్నా, వదినల దగ్గర గోడుగోడుమన్నాడు. చంద్రబాబు నాయుడాదులందరి వద్దా రమేష్‌రెడ్డిపై ఫిర్యాదులు విన్పించాడు. రమేష్‌రెడ్డిని పార్టీ నుంచి బహిష్కరింప జేయాలన్నంత దూరం వెళ్లింది ఆందోళన.

తన ఓటమికి రమేష్ రెడ్డి కారకుడని నిందించే ముందు, రమేష్‌రెడ్డి ఆ తీరులో ప్రవర్తించడానికి తానెంత వరకు బాధ్యుడో ఒక్కసారి ఆత్మవిమర్శ

కొరవ18 పేజీలో

పరిపాలన కష్టమే!

# కౌన్సిల్‌లో బలం లేదు-ఖజానాలో నిధులు లేవు!

ఎమ్మెల్యేగా పోటీచేసే అవకాశం లభించినా తాను వదలుకొని తమ్ముడు ఆనం రామనారాయణ రెడ్డిని రంగంలోకి దించ వలసి వచ్చింది. రెండు దశాబ్దాల ఎదురు చూపు తర్వాత ఇప్పుడు అవకాశం లభించింది. ఇన్నేళ్లపాటు ఏ పదవి లేకుండా రాజకీయ ఆటుపోట్లు అనుభవించి వెలుగులో వుండగల్గడం విశేషం. తనకు ఏ పదవి రాకపోయినా, టౌన్‌లో ఆనం కుటుంబమనే పేరు ఈ మాత్రమైనా వినిపిస్తున్నదంటే అందుకు వివేకాయే కారణం.

ఇన్నేళ్ల పోరాటం, శ్రమ, ఆశనిరాశలు, ఆటుపోట్ల తర్వాత ప్రాముఖ్యత కల్గిన పదవి పొందిన వివేకాను అభినందిస్తున్నాము.

* * *

స్వర్గీయ ఎసి. తన తండ్రి ఆనం వెంకటరెడ్డి కూర్చున్న కుర్చీలో ఈరోజు తాను ఆసీనుడు కాబోతున్నాడు. అయితే రాజకీయ పరంగా, పరిపాలనా పరంగా వారిద్దరికీ వుండిన సానుకుల వాతావరణం వివేకాకు లభించడంలేదు. వివేకా కిదొక ముళ్ల కిరీటమే.

ఎసి. వెంకటరెడ్డిల హయాంలో టౌన్‌లో రాజకీయంగా వారికి ఎదురు లేదు. ఎదుట నిల్చి మాట్లాడేవాడు లేడు. వారు చెప్పింది వేదం, చేసింది శాసనం. ఇప్పుడు టౌన్‌లో వీధికొక నాయకుడు,


మునిసిపల్ ఛేర్మన్‌గా వివేకానందరెడ్డిచేత ప్రమాణ పత్రం చదివిస్తున్న కలెక్టర్ ప్రేమ్‌చంద్

ఇంటికొక పెద్ద. ఎవరూ ఎవరిమాటా వినే అవకాశం లేదు. ఒక పార్టీగా కాంగ్రెస్ పటిష్టంగా లేదు; ఒక వర్గంగా ఆనం ప్రాభవంలో లేదు. కాంగ్రెస్‌లో పదివర్గాలున్నాయి. పెద్దరికంతో, ఏకాభిప్రాయంతో రాజకీయం చేయడం అసాధ్యం. ప్రాధేయపడుతూ, బ్రతిమలాడుతూ బండి నెట్టాల్సిందే!

పరిపాలనలో ఇదివరకటి పెత్తనం చలాయింపు కూడా అసాధ్యం. మునిసిపాలిటిలో ఉద్యోగులు, అధికారులు తెగబలిసి పోయి వున్నారు. పనిచేసే ఆలోచన ఎవరికీ లేదు. శానిటరీ సిబ్బంది సైతం ఒకటో తేది వచ్చి జీతం తీసుకోవడం తప్ప పనికి వెళ్ళు వంచడం లేదు. అవినీతికి పుట్టినిల్లుగా మారివుంది. మునిసిపాలిటీ క్రింద నుంచి పైవరకు లంచాల జబ్బుతో కుళ్లిపోయి వుంది. వీరందరినీ లొంగదీసి పౌర సౌకర్యాల కల్పనకు వినియోగించడం అలివయ్యే పనేనా?

## మొదటి పేజీ తరువాయి

అందులోనూ వివేకానందరెడ్డిది మైనారిటీ ప్రభుత్వం; కౌన్సిలర్లబలం లేదు. ఎప్పుడు ఏ మాత్రం ఏమరుపాటుగా వుండినా రాజకీయ రచ్చలు తథ్యం. తీర్మానాలు మంజూరు కావు. ఖజానాలో నిధులు లేవు. రెండేళ్ల నుంచి పైన పైన కూడబెట్టి ఏనెలకానెల జీతాలకోసం సర్దడం తప్ప ఒక్క కాలిపోయిన బల్బు మార్చమన్నా మా తరం కాదంటున్నారు అధికారులు. గెల్చిన మోజులో రెండు రోడ్లు వేద్దామనుకున్నా ఖజనాలో చిల్లర లేదు.

ఈ పరిస్థితులలో వివేకానందరెడ్డి పురపాలన ఎటువంటి సంక్లిష్ట పరిస్థితుల నెదుర్కోబోతుందో వూహించడం కష్ట సాధ్యంకాదు. రాజకీయ మతలబులు సృష్టించి, ఆ చిక్కుముడులు విప్పడానికి రాత్రి పగలు తిరగడం తప్ప పరిపాలనా పరంగా ఎటువంటి అనుభవం లేని వాడు వివేకానందరెడ్డి. ఈ గడ్డు పరిస్థితుల నెదుర్కొని ఎట్లా నెగ్గుక రాగలడో చూడాలి. ఎసి. ఆనం వెంకటరెడ్డిల హయాంలో తమ తమ స్థాయిలో నాయకులుగా, మేధావులుగా చలామణి అయ్యేవారు కౌన్సిలర్లుగా

## రియల్ హీరో!



నెల్లూరు మునిసిపాలిటీకి ఎంపికైన 44 మంది కౌన్సిలర్లలో నిజమైన హీరో కెవి రాఘవరెడ్డి సనాలి. మొత్తం ఛైర్మన్ ఎన్నిక కంటే ఈ ఒక్క వార్డు ఎన్నిక ఒక్కటే అంత ఉద్రిక్తంగా జరిగింది. మాజీ ఎమ్మెల్యే శ్రీ జెకె రెడ్డి, శ్రీ పివి ప్రసన్నరెడ్డి వంటి అతిరథ మహారథుల బాణాలన్నీ కాచుకొని, విజయుడైనాడు రాఘవరెడ్డి. మాగుంట సుబ్బరామరెడ్డిగారు ఒక్క వార్డు వదిలేస్తే చాలునని రామబాణం నడిపింది రాఘవరెడ్డి విషయంలోనే! అందరూ తూట్లు పొడిచినా అంత మెజారిటీతో గెలుపొందడం హీరోయిజమే కదా?

ఎన్నికయ్యేవారు. కౌన్సిల్ నిర్వహణలో వారి సలహాలు వుపకరించేవి. కాని ఇప్పుడు గెల్చిన కౌన్సిలర్లలో, వారే పార్టీ వారైనా కాని, ఆ స్థాయి కల్గినవారు ఒక్కరూ లేరు. కాంగ్రెస్‌లో కెవి రాఘవరెడ్డి, చాట్ల నరసింహారావులు మాత్రమే రెండేసి సార్లు కౌన్సిలర్లుగా

తరువాయి 12 పేజీలో



అసామాన్యమైన రాజకీయ చతురత
అనుపమానమైన సేవా జీవితం
అలుపన్నది ఎరుగని పోరాట పటిమ
అరుదైన పరిపాలనాదక్షత, కార్యశీలత
ఆభరణాలుగా కల్గిన యువజన నాయకుడు
మా కళాశాల నిర్వాహకుడు

# శ్రీ ఆనం వివేకానంద రెడ్డి గారు

నెల్లూరు మునిసిపల్ ఛేర్మన్‌గా ప్రమాణ స్వీకారం చేసిన
శుభసందర్భంలో అభినందన సుమాంజలులు సమర్పిస్తున్నాము.



ప్రిన్సిపల్ మరియు సిబ్బంది

## యస్.వి.జి.ఎస్. ఆర్ట్స్ & సైన్స్ కాలేజి, నెల్లూరు

జిల్లావార్తలు

# గూడూరు, కావలి ప్రమాణాలు!

గూడూరు మునిసిపల్ ఛైర్మన్‌గా శ్రీ పాశం సునీల్ కుమార్ 29తేది ప్రజల సమక్షంలో ప్రమాణ స్వీకారం చేశారు. బహిరంగ వేదికపై గూడూరు ఆర్డీవో నరేష్ ప్రమాణ పత్రాన్ని ఆయన చేత చదివించారు. ఆ తర్వాత ఛైర్మన్ 28 మంది కౌన్సిలర్ల చేత ప్రమాణ పత్రం చదివించారు. అనంతరం మాట్లాడుతూ గూడూరు పట్టణ ప్రజలు, రాజకీయ నాయకుల సహకారంతో సమస్యలు పరిష్కరించ గలనన్నారు. పట్టణంలో పలు సమస్యలు వున్నాయి; గూడూరును సుందర నందన వనంగా తీర్చిదిద్ద లేకపోయినా ఇప్పుడు వున్న సమస్యలను పరిష్కరిస్తానని సభాముఖంగా హామీ ఇచ్చారాయన.

ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ ఎక్స్ అఫిషియో సభ్యునిగా ప్రమాణ పత్రం చదివారు. 15 వార్డులో ఎన్నికైన కాంగ్రెస్ సభ్యుడు న్యాయవాది వి. గోపికృష్ణ ఛైర్మన్ ప్రమాణ పత్రం



గూడూరు ఛైర్మన్

పాశం సునీల్ కుమార్

చదువుతుండగా తనకు రాజ్యాంగం తెలుసునని, అందువల్ల ఒకరు చదివితే తాను పలకనని మొండికేశారు. చివరకు ఆర్డీవో జోక్యంచేసుకొని నిబంధనలు అనుసరించాలని కోరడంతో మెత్తబడ్డారు. ఛైర్మన్ ప్రమాణ స్వీకారం తరువాత టౌనంతా బాణాసంచా మోతతో మార్మోగిపోయింది. దగ్గరుండి ఈ కార్యక్రమాన్ని నడిపించాల్సిన మంత్రి శ్రీ ప్రసన్న కుమారరెడ్డి అసెంబ్లీ సమావేశాలు జరుగుతున్నందు వల్ల కాబోలు గైర్‌హాజరైనాడు. ఆ ఛాన్సు దుర్గాప్రసాద్‌కు లభించింది. తాను తెలుగుదేశంలో వున్నదీ, లేనిదీ అర్థంకాక సతమత మౌతున్న వేమారెడ్డి రామచంద్రారెడ్డిగారూ రాలేదు.

## మూకుమ్మడి ప్రమాణాలు!

కావలిలో మునిసిపల్ ఛైర్మన్ ప్రమాణ స్వీకార కార్యక్రమాన్ని సాయంత్రంగా పెట్టుకున్నారు. కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో ప్రదర్శన కూడా ఏర్పాటు చేసి వుండడంతో



కావలి ఛైర్మన్

చలంచర్ల దేవసేన

కౌన్సిలర్లందరి చేత ఆర్డీవో ఎం.వి. బ్రహ్మయ్య మూకుమ్మడిగా ప్రమాణ పత్రాలు చదివించారు. ఛైర్‌పర్సన్ దేవసేన మాత్రం విడిగా ప్రమాణ స్వీకారం చేశారు. కార్యక్రమానికి ఎమ్మెల్యే కలికి యానాదిరెడ్డి, ఎంపీ మాగుంట సుబ్బరామరెడ్డి ముఖ్య అతిథులుగా హాజరయ్యారు. అనంతరం కార్యకర్తలు విజయోత్సవ ప్రదర్శన నిర్వహించారు. టాపులేని జీపులో యోధాన యోధులు వున్నా కావలి ప్రజలు కాబోయే వైస్ ఛైర్మన్ యానాదిశెట్టినే పూలమాలలతో ముంచెత్తారు!



ఆలిండియా రేడియో వసంత మాధవ రావు తన ఆప్తమిత్రుడు వివేకానంద రెడ్డి మునిసిపల్ ఛైర్మన్ అయిన సందర్భాన్ని పురస్కరించుకొని విందు చేశారు. ఆ చిరు సత్కార సభలో వీరిద్దరితో పాటు ఆనం భక్తవత్సలు రెడ్డి

విజయోత్సవం తర్వాత జరిగిన బహిరంగ సభలో చాలా కాలం పిమ్మట ఎమ్మెల్యే శ్రీ కలికి యానాదిరెడ్డి గారు రాజకీయోపన్యాసం చేశారు. సాధారణంగా యానాదిరెడ్డి గారు పెద్దగా ఉపన్యాసాలు చేయరు. తనపై వచ్చే విమర్శలను పట్టించుకోరు. కాని ఎన్నికల ప్రచార సమయంలో తెలుగు మంత్రి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి తనను రాక్షసుడిగా వర్ణించడం కష్టం కల్గించినట్లుంది. అందుకే సభావేదికపై నుంచి సమాధానం చెప్పారు. కావలి రాజకీయాలలో వైస్ ఛైర్మన్‌గా ఎన్నిక కాబోతున్న శ్రీ గ్రంధి యానాదిశెట్టి తనకు వారసుడని ప్రకటించారు. ఇది పాత ప్రకటనే!

పార్లమెంట్ సభ్యుడు శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి గారు ఈ విజయోత్సవ ప్రదర్శనలో, సభలో పాల్గొన్నారు. ఒక్క కావలి మాత్రమే కాక, తన నియోజక వర్గ పరిధిలోని ఒంగోలు మునిసిపాలిటీని కూడా కాంగ్రెస్‌కు వచ్చేట్లు కష్టపడ్డానని చెప్పారాయన.

## ఎస్‌ఐ పర్సునే కొట్టేసిన దొంగలు!

చోరీ శిఖామణుల హస్తలాఘవానికి ఎస్‌ఐ సైతం దాసోహమన్నాడు. రాపూరు ఎక్సైజ్ ఎస్‌ఐ డ్యూటీపై తెగచర్ల నుండి రాపూరు వస్తున్నప్పుడు ప్రక్కనే నిలబడిన చోరుడు బ్లేడుతో ప్యాంటు జేబుకోసి పర్సు కొట్టేశాడు. రాపూరులో దిగినాక ఎస్‌ఐ ఈ విషయాన్ని కలచెలుసుకొని తన పరివారంతో కలి... వేటలో

(కరవ 12 పేజీలో)

# నెల్లూరు రాజకీయాల్లో
## విమర్శకుడు

### వైస్ ఛైర్మన్ ఎన్నిక

నెల్లూరు మునిసిపల్ వైస్ ఛైర్మన్ ఎన్నిక 6తేది జరుగుతుంది. దీనిమీద అప్పటి నుంచే ఆశలు, చర్చలు బయటపడు తున్నాయి. గెల్చిన కౌన్సిలర్లందరూ తమ తమ పార్టీకి విధేయులుగా వుంటే, వైస్ ఛైర్మన్ పదవి తెలుగుదేశం-సిపిఎంల కూటమికి పోవాలి. కాంగ్రెస్‌కు ఏ రూపంలోనూ బలం లేదు. వారికుండే కౌన్సిలర్ల సంఖ్య 17; ఐదుగురు స్వతంత్రులలో నలుగురు ఇటే వచ్చినా కేవలం 21 అవుతుంది. కౌన్సిల్‌లో 44 మంది సభ్యులు. ఒక ఎమ్పీ, ముగ్గురు ఎమ్మెల్యేలు ఓట్లు కల్గివున్నారు. అంటే మొత్తం ఓట్ల సంఖ్య 48. వైస్ ఛైర్మన్ గెలవాలంటే కనీసం 25 ఓట్లుండాలి. సిపిఎం 8, తెలుగుదేశం 13, ముగ్గురు ఎమ్మెల్యేలు, ఒక స్వతంత్రుడు కలిస్తే ఆ సంఖ్య సరిగ్గా సరిపోతుంది.

కాని కాంగ్రెస్‌లో చాలామంది దీనిపై ఆశ పెట్టుకొని వున్నారు. మాగుంట వర్గం మరీ ముఖ్యంగా దీనికై ఆరాట పడుతున్నది. స్వతంత్రుడిగా గెల్చిన నందాని బాషను ఆ పదవిలో నిలపాలన్నది వారి ప్రయత్నం. కాంగ్రెస్ గెలవాలంటే కనీసం ఐదుగురు తెలుగుదేశం కౌన్సిలర్లను ఆకర్షించాలి. వారు కాంగ్రెస్‌కు ఓటేసినా, లేక ఎన్నికకు గైర్‌హాజరైనా కాంగ్రెస్ గెలుస్తుంది. అయితే టిక్కెట్‌పై గెల్చిన వారంరోజుల లోపల పార్టీ ఫిరాయింపుకు వారు సిద్ధపడతారా? లోపాయికారీ సర్దుబాటు వీలుకాదు. ఫిరాయింపుల చట్టం అర్థం వస్తుంది. విప్‌జారీ చేయబోతున్నారు. పార్టీని చీల్చుకొని బయటకు రావాలి.

తెలుగుదేశం, సిపిఎంల మధ్య ఈ విషయంలో సరైన అవగాహన లేకపోవడం కాంగ్రెస్‌కు ఆశ. సిపిఎం చాలా పట్టుదలగా వుంది- ఈ పదవి తమకు ఇచ్చి తీరాలని! కానీ, ఛైర్మన్ ఓడిపోయిన పరిస్థితిలో, వైస్ ఛైర్మన్‌ను గెల్పించుకోగల్గితే రమేషరెడ్డి ప్రతిష్ట నిలుస్తుంది. తమకు అవకాశం ఇవ్వనప్పుడు, విడిగా పోటీ చేయడానికి సిపిఎం నిర్ణయం తీసుకొంటే మాత్రం వైస్ ఛైర్మన్ కాంగ్రెస్ అభ్యర్థే అవుతాడు.

తెలుగుదేశం పార్టీలో చీలిక తేగల్గితే వివేకానందరెడ్డికి సౌలభ్యం. కౌన్సిల్‌లో మెజారిటీ సాధించుకో గల్గుతాడు. కానీ అది సాధ్యమా?




### జమీన్‌రైతు

పత్రిక నిర్వహణ ఖర్చులు, ఇబ్బడి ముబ్బడైనందున ప్రకటన రేట్లు పెంచక తప్పడం లేదు. ఏప్రెల్ 1 తేది నుండి ఈ క్రింది రేట్లు వర్తిస్తాయి. ప్రకటన దారులు సహకరించ ప్రార్థన.

| | |
|---|---|
| కాలం సెం.మీ. | రూ. 18/- |
| మొదటి పేజీ | రూ. 36/- |
| ఆఖరు పేజీ | రూ. 24/- |

న్యూస్ ప్రింట్ ధర పెరుగుతున్నా చందాదారుల సౌకర్యార్థం చందా మాత్రం పెంచడం లేదు.

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 100/- |
| అర్థ సంవత్సర చందా | రూ. 50/- |
| విదేశీ చందా | రూ. 600/- |


మెజారిటీ తెచ్చి, స్వయంగా వైస్ ఛైర్మన్‌ను నిలబెట్టే పరిస్థితిలో స్వంత వర్గం నుంచి చాలా వత్తిడులు వస్తాయి. ఆ అలుకలు తట్టుకోవడం కష్టం. అందువల్ల వివేకా, చీలికకు ప్రయత్నించ కుండా చూసీ చూడనట్లు తెలుగుదేశానికే వదిలేస్తాడేమో!

* * *

కావలి వైస్ ఛైర్మన్‌గా శ్రీగ్రంధి యానాది శెట్టి నిష్పోటీగా ఎన్నిక కాబోతారు. ఆయనకు ఆటంకాలేవీ లేవు.

గూడూరుకు ఎవరో మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి ఇంకా నిర్ణయించలేదు. ఆయన ఎవరిపేరు చెప్తే వారికే పదవి.

### మాగుంట వదలిపెట్టడం లేదు

ఎమ్పీ మాగుంట సుబ్బరామరెడ్డిగారు జమీన్‌రైతుకు తన ఉదయం దినపత్రికలో విశేష ప్రచారం కల్పించే కార్యక్రమాన్ని విడనాడడం లేదు. నిన్నటి (30తేది) సంచికలో కూడా మొదటి పేజీలో "జమీన్‌రైతు వాగుడుకు విరుగుడు" అనే శీర్షికన ఐదు కాలాల విమర్శ వ్రాశారు. ఆయన దీన్ని ఒక సీరియల్‌గా నిర్వహిస్తున్నారు. ఆ పరంపరలో ఇది నాలుగవది. మునిసిపల్ ఎన్నికల్లో తాను సహాయం చేస్తేనే వివేకానందరెడ్డి గెల్చాడని, అయితే జమీన్‌రైతు మాత్రం తమ వర్గం వివేకాకు వెన్నుపోట్లు పొడిచినట్లు వ్రాసిందని వాపోయారు. తాను ఎక్కడ కాలుపెడితే అక్కడల్లా కాంగ్రెస్ గెల్చిందని, జనార్దనరెడ్డి గూడూరులో కాంగ్రెస్‌ను గెల్పించ లేక పోయాడని ఎద్దేవా చేశారు. జమీన్‌రైతును, సంపాదకుడ్ని తమ పేనాలో ఇంకు అయిపోయేంతవరకు తిట్టి పోశారు.

ఆత్మస్తుతి, పరనింద వ్యక్తిత్వ పతనానికి చివరి మెట్టు. గూడూరులో కాంగ్రెస్‌ను గెల్పించలేక పోయాడని జనార్దనరెడ్డిని ఎగతాళి చేసే ముందుగా, తన నియోజక వర్గంలోని ఒక్క మండలంలో కూడా కాంగ్రెస్ గెలవలేదన్న నిజం సుబ్బరామరెడ్డి గారు గుర్తు చేసుకొని వుంటే బాగుండేది. కావలి రూరల్, దుత్తలూరు, వరికుంటపాడు, సీతారామ పురం, ఉదయగిరి, జలదంకి, కొండాపురం వగైరాలన్నీ కాంగ్రెస్ చేజారి పోయాయి. జనార్దనరెడ్డే నయం- వెంకటగిరిలోని మండలాలన్నీ గెల్పించారు.

సుబ్బరామరెడ్డిగారు తన వ్యక్తిగత కోపతాపాలకు తన పత్రికను వేదికగా వాడుకొని తాను చులకనై పోవడంతోపాటు, ఆ పత్రికనూ భ్రష్టు పట్టించేస్తున్నారు. జమీన్‌రైతు సంపాదకుడిపై విమర్శల కోసమే ఆయన ఆ దినపత్రిక నడుపుతున్నట్లుంది. మాకు అంత గౌరవం కల్పిస్తున్నప్పుడు మేమెందుకు కాదనాలి? నెల్లూరు మునిసిపాలిటీలో ఆయన వర్గం ఎంత మాత్రం చిత్త శుద్ధితో కాంగ్రెస్ గెలుపుకు పనిచేసింది ప్రతి ఒక్కరికీ తెలుసు. దానిపై మళ్ళీ చర్చ అనవసరం.

### వేమారెడ్డి శ్యామయ్యకు కారు ప్రమాదం

వేమారెడ్డి రామచంద్రారెడ్డి సోదరుడు, ఈదగాలి పెద్ద రైతు, దైవ భక్తుడు శ్రీ వేమారెడ్డి శ్యామ సుందర రెడ్డి 27 తేది ఉదయం వెంకటాచలం దగ్గర కారు ప్రమాదానికి లోనైనారు. ఒకటి రెండు చోట్ల ఫ్రాక్చర్ అయింది. ఇప్పుడు మద్రాసు అపోలో ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు.

శ్యామన్న తొందరగా కోలుకొని, సంపూర్ణా రోగ్యంతో తిరిగి రావాలని కోరుకుంటున్నాము.

### పెళ్లకూరుకు మళ్లీ పదవి!



ఇఫ్కో ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారు మరొకసారి లక్కీ ఛాన్స్ కొట్టేశారు. ఆయన పదవి కాలం ఈ మార్చిలో పూర్తయింది. ప్రధాని శ్రీ పివి నరసింహా రావు గారు స్నేహితుడిని ఖాళీగా కూర్చో బెట్టడం ఇష్టం లేక మళ్లీ అదే పదవిలో పునర్ని యామకం చేశారు. పివికి పెళ్లకూరు పట్ల వుండే ప్రగాఢ అభిమానానికి నిదర్శనమీ నియామకం.

పెళ్లకూరు తన మూడేళ్ల పదవి కాలంలో ఇఫ్కో ప్రతిష్ట పెంచారు. వేల కోట్ల టర్నోవర్ కల్గిన సంస్థకు అధిపతి అయినా కూడా ఎవరూ వేలెత్తి చూపే పరిస్థితి తెచ్చుకోలేదు. ఆ నిజాయితీయే పివిని సంతోష పెట్టింది. నెల్లూరుకు వెయ్యి కోట్ల ఎరువుల ఫ్యాక్టరీ మంజూరు చేయించడం పెళ్లకూరు పదవిని సార్థకం చేసింది. మంజూరే కాకుండా తన చేతుల మీదుగా నిర్మాణం సైతం జరిపించే భాగ్యం పొందిన ఆయన అదృష్ట వంతుడు. పెళ్లకూరుకు మా హార్దికాభి నందనాలు.

### భీష్మాచార్యుడి పై గెలుపు

34 వార్డు స్వతంత్ర అభ్యర్థి శ్రీ. వేలూరు సుబ్బారావు గెలుపును విశేషంగా



పేర్కొనాలి. అది ఆనం వారి పెరటి వార్డు. వారిని వ్యతిరేకించి ఎప్పుడూ ఎవరూ గెలవలేదు. తాను రాజకీయాలలోకి వచ్చిన తర్వాత జరిగిన ప్రతి ఎన్నికలోనూ అక్కడ నుంచి

(కొరవ 12 పేజీలో)

# శ్రీ రాజరాజేశ్వరి దేవస్థానం

దర్గామిట్ట - నెల్లూరు



రాజరాజేశ్వరి అమ్మవారి అనుగ్రహంతో
సింహపురి పౌరుల అభీష్టం మేరకు
నెల్లూరు మునిసిపల్ ఛేర్మన్‌గా
పదవీ ప్రమాణ స్వీకారం చేసిన
నిజాయితీ పరుడు, నిత్యోత్సాహి
నిరాడంబరుడు, స్నేహశీలి

# ఆనం వివేకానంద రెడ్డి



తన పరిపాలనా దక్షతతో
పౌర సౌకర్యాల కల్పనా దీక్షతో
సామాన్య ప్రజా సాన్నిహిత్యంతో
నెల్లూరు జిల్లా పేరు నిలబెట్టాలని;
ప్రతిపౌరుడూ శెబాష్ అనే రీతిలో వ్యవహరించాలని

కోరుకుంటున్నాము!
పదవిలో వున్న ఐదేళ్లూ ఆ తల్లి
చల్లని దీవెనలు ఆయన కందాలని ప్రార్థిస్తున్నాము

- ధర్మకర్తల మండలి

దేవస్థానానికి అనుబంధంగా నిర్మిస్తున్న నూతన కళ్యాణ మండపం తుదిమెరుగులు దిద్దుకుంటున్నది. అమ్మవారి భక్తులు ఈ భగవత్కార్యం మరింత త్వరితగతిన పూర్తి చేసేందుకు సహకరించ ప్రార్థన.

## నెల్లూరు ముచ్చట్లు

10 పేజీ తరువాయి

కౌన్సిలర్‌గా గెల్చిన భీష్మాచారులు శ్రీ పుట్టా బలరామి రెడ్డికి వ్యతిరేకంగా, ఆయన నిలబెట్టిన కాంగ్రెస్ అభ్యర్థికి ప్రతిగా పోటీ చేసి గెల్చారు సుబ్బారావు.

### రంగనాథం మృతి

నెల్లూరులో లీడింగ్ క్రిమినల్ లాయర్ శ్రీ ఎస్. రంగనాథం 28 తేది రాత్రి తన ఇంట్లోనే గుండె పోటుతో మరణించారు. ఆయన వయస్సు 69 సంవత్సరాలు.

రంగనాథం గారు చాలా సీనియర్ లాయర్. జిల్లాలో ఎన్నో సంచలనాత్మక హత్య కేసులలో ఆయన ముద్దాయిల పక్షంగా వాదించారు. ఇతర జిల్లాల నుండి వచ్చి కూడా క్రిమినల్ కేసుల్లో ఆయన సలహా పొందేవారు.

గత మూడేళ్లుగా ఆయన జిల్లా లోక్ అదాలత్ కన్వీనర్‌గా వ్యవహరిస్తున్నారు. ఈ పదవిలో ఆయన బాధ్యతల నిర్వహణ తీరును సుప్రీం కోర్టు న్యాయ మూర్తులు కూడా ప్రశంసించారు. ఇది వరకెక్కడ [illegible]గా పనిచేసిన విష్ణు ఆయన అల్లుడు.

వారి కుటుంబానికి మా సానుభూతి.

## జిల్లావార్తలు

( 5 పేజీ తరువాయి )

పద్దారు. ఎస్‌ఐ శ్రమ ఫలించింది. దోచుకున్న డబ్బుతో కోళ్లు కొనుక్కొని రోడ్డు ప్రక్కనే వంట చేసుకొంటున్న బిట్రగుంట దొంగలు ఎస్‌ఐ చేతిలో చిక్కిపోయారు. ఎస్‌ఐ పర్సు తిరిగి ఇచ్చేయడంతో జాలి హృదయుడు వారిని పోలీసులకు అప్పగించకుండా వదిలి వెళ్ళిపోయారు. ఇది ఆ ఎస్‌ఐకి తగునా?

## షేర్లు

2 పేజీ తరువాయి

నిర్మూలన కోసం ఇచ్చే అప్పులు తిరిగి వసూలు చేయడం బ్యాంకులకు ఎప్పుడూ కష్ట సాధ్యమైన విషయమే! ఈ భారం మోయవలసి రావడం వల్ల పలు బ్యాంకులు నష్టాలకు గురయ్యే అవకాశం వుంది.

బడ్జెట్‌లో పన్నులు తగ్గించినందు వల్ల ఎలక్ట్రానిక్స్, కంప్యూటరు, తదితర పరిశ్రమలు లాభ పడతాయి. టివిఎస్ ఎలక్ట్రానిక్స్, కెల్టి ఎలక్ట్రానిక్స్, సామ్ టెల్ ఎలక్ట్రానిక్స్, సత్యం కంప్యూటర్స్, పెంటాఫోర్ సాఫ్ట్‌వేర్ వంటి కంపెనీలు ఈ జాబితాలోకి వస్తాయి.

ఎరువుల పై సబ్సిడీలు పెంచినందువల్ల, వాడకం పెరుగుతుంది. అందువల్ల నాగార్జున ఫెర్టిలైజర్స్, దీపక్ ఫెర్టిలైజర్స్ లాభ పడతాయి. వీటి పై పెట్టుబడికి నష్టం రాదు.

మహారాష్ట్రలో కొత్తగా ఏర్పడిన శివసేన ప్రభుత్వం తాము ఆర్థిక సంస్కరణలకు వ్యతిరేకం కామని ప్రకటించడం వల్ల, బొంబాయిలోని పెద్ద పరిశ్రమలు వూపిరి పీల్చు కొంటున్నాయి.

యుటిఐ, మాస్టర్ ప్లస్, మాస్టర్ గెయిన్, మాస్టర్ షేర్ వంటి మ్యూచ్యువల్ ఫండ్స్ ఇచ్చే డివిడెండ్ల పై పన్ను విధించడం వల్ల వాటి షేర్ల ధరలు తగ్గే అవకాశం వుంది.

మార్చి ఆఖరున వివిధ కంపెనీలు విడుదల చేసే వార్షిక ఫలితాల పై రానున్న మూడు నాలుగు నెలలలో స్టాక్ మార్కెట్ ప్రభావిత మౌతుంది. ద్రవ్యోల్బణం అదుపులో వుంది. వర్షాలు సక్రమంగా కురిస్తే కాని కంపెనీలు లాభా లార్జించలేవు.

# In the Court of Subordinate Judge : Nellore

E.P. 72/93 : O.S. 115/79

State Bank of India, Kovur, rep by its Manager - Petitioner Vs Basireddy Ramana Reddy - Respondent

The schedule property belonging to the respondent will be auctioned before the above court on 17.4.95 between 10.30A.M. & 5 P.M. Intending bidders may participate on that day.

**Item No. 1:** Nellore Dist. registration, Nellore taluk, Indukurupeta sub registration, Koduru Panchayat, Koduru Village.

S.No. 168/A2, Ac. 0.32 of Wet land on the western side out of Ac. 1.22 or 0.488 Hec. in Bit - I village Koru Patta No. 104, bounded by

East: Land of Patur Ramana reddy situated in S.No. 168/A2; South: Land of Basireddy Kameswaramma upto some extent and land of Pamuru Ramana Reddy got under exchange to some extent; West: Thotakura Dharmaiah's land

within these boundaries A.C. 0.32 of land

Value of D.Hr. Rs. 3,200/- Value of Amin Rs. 12,8000/-

**Item No. 2:** Nellore Dist. Regn. Nellore Taluk, Indukurpeta sub registration, Koduru Panchayat, Koduru Village 0.11 1/8 cents or Hec. 0.44 1/2. On the western side out of 0.32 cents in the S.No. 168/A3 bounded on

East: Ponnuru Ramana Reddy's land; South: West: Basireddy Kameswaramma's land; North: Ponnuru Ramana Reddy's land got under exchange within these boundaries 0.11 1/8 cents of land

D.Hr Value Rs. 1,200/- Amin's value Rs. 4,450/-

**Item No. 3:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpet Sub regn. Koduru Panchayat, Koduru Village, Bit - I Patta No. 31, S.No. 174, extent: 0.243/4 cents of wet land out of Ac. 1.99 of land bounded on

East: Thotakura Gopalaiah's land in S.No. 174; South: Thotakura Gopalaiah and Cheneti Subbamma's land in S.No. 174; West: Bathala Parvathamma's land; North: Asalu Minaha kalva;

within these boundaries 0.243/4 cents or 0.098 Hec.

D.Hr's Value Rs. 2,500/- Amin's Value Rs. 8,650/-

**Item No. 4:** Nellore Dist. registration, Nellore taluq, Indukurupet sub regn. Koduru Panchayat, Koduru village, Patta No. 32, S.No. 174 an extent of 0.131/2 cents of wet land out of Ac. 1.99 of land bounded on

East, South, West : Bathala Parvathamma's land in S.No. 175/2; North: Asaluminaha kalva

within these boundaries 0.131/2 cents or 0.044 Hec.

D.Hr's value Rs. 1,400/- Amin's value Rs. 4,725/

**Item No. 5:** Nellore Dist. registration Nellore taluk, Indukurupeta sub regn. Koduru panchayat Koduru village Koru Patta No. 258, S.No. 175/2B an extent of 0.283/4 cents of wet land out of 0.99 cents bounded by

East: Land in S.No. 174; South & West: Irrigation Channel; North: Asaluminaha kalva

within these boundaries 0.283/4 cents or 0.115 Hec.

D.Hr. value Rs. 2,900/- Amin's value Rs. 10,000/-

**Item No. 6:** Nellore Dist. registration, Nellore taluk, Indukurupet sub regn. Kodur village S.No. 172/E an extent of 0.061/4 cents out of 0.30 cents of wet land bounded by

East: Land in S.No. 171/B2; South & North: Thotakura Dharmaiah's land; West: Irrigation Channel

within these boundaries 0.061/4 cents or 0.025 Hec.

D.Hr.'s value Rs. 650/- Amin's value Rs. 2,500/-

**Item No. 7:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpet Sub regn. Koduru panchayat, Koduru village S.No. 171/B2 an extent of 0.24 1/4 cents or 0.105 Hc of wetland out of 0.93 cents bounded on

East: Thupili Subbaramireddy's land; South: Thotakura Dharmaiah's land; West: Irrigation Channel; North: Valluru Subbarami reddy's land

D.Hr. Value Rs. 2,500/- Amin's Value Rs. 9,700/-

**Item No. 8:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpet sub regn. Koduru panchayat, Koduru village an extent of 0.81/4 cents of wet land out of 0.93 cents bounded by 0.035 Hec.

East: Ponnuru Ramanareddy's land; South & North: Thotakura Dharmaiah's land; West: Land belonging to Basireddy Ramanareddy got under Sale deed dt. 30.3.54

D.Hr.'s Value Rs. 850/- Amin's Value Rs. 3,500/-

**Item No. 9:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpet sub regn. Koduru panchayat, Koduru village, Koru patta No. 31, S.No. 170/C extent 0.091/2 cents of 0.037 Hec. wet land out of 0.80 cents bounded by

East & North: Land of Thotakura Gopalaiah; South: Land of Thotakuru Dharmaiah with 1/4th share in the leterite stone wall constructed in 0.83 cents in S.No. 170/C

D.Hr's Value Rs. 900/- Amin's Value Rs. 3,325/-

**Item No. 10:** Nellore Dist. regn. Nellore taluk, Indukurpet Sub regn. Koduru Panchayat, Koduru Village, Patta No. 39 Ac. 2.34 of wet land as follows

| S.No. | Extent Ac. |
|---|---|
| 384/1 | 2.39 |
| 384/2 | 7.19 |
| 389/3 | 1.58 |
| 397/A | 1.52 |
| 399/B | 0.53 |
| 392/A | 0.24 |
| 397/B | 0.53 |
| | 18.35 |

which was the north of Ac. 10.60 or 0.4140 Hec. of Koduru Gopalaiah with standing crop therein.

D.Hr.'s valule Rs. 8,350/- Amin's value Rs. 3,18,000/-

Date 28.3.95

**W. Subrahmanyam,**
Advocate, KOVUR

## మునిసిపాలిటీ

7 పేజీ తరువాయి

వ్యవహరించిన అనుభవం కల్గిన వారు. తక్కిన వారికి కౌన్సిల్ హాలు ముఖం చూడడం కూడా ఇదే ప్రథమం. ఇటువంటి పరిస్థితులలో ఛైర్మన్ అయిన వివేకానందరెడ్డి ఎట్లా నెగ్గుక రాగలడన్న విషయం టౌన్‌లోని నాలుగు లక్షల జనాభా ఆసక్తితో ఎదురు చూస్తూవుంది. రాజకీయంగా తాను టౌన్‌లో నిలదొక్కుకోవడానికి, పరిపాలనా పరంగా ప్రజల మన్ననలు పొందడానికి వివేకానందరెడ్డి చాలా కష్టమే పడవలసి వుంటుంది. టౌన్‌లోని వారందరి సలహా సహకారాలూ స్వీకరించి, సిబ్బంది పైన వెయ్యి కళ్ళతో, వంద చేతులతో అజమాయిషి చేస్తె తప్ప గుర్తింపు పొందడం అసాధ్యం.

* * *

కౌన్సిల్‌లో ఈసారి సిపిఎం పార్టీ నిర్ణయాత్మక పాత్ర వహించబోతున్నది. ప్రతి పక్షంలో తెలుగుదేశం పార్టీకి 13 స్థానాలున్నా వారికి నాయకత్వం లేదు. ఇంతకాలం వారు కలిసి వుండలేరు. పిలికలు. పేలికలు కావడం తథ్యం. నికరమైన ప్రతిపక్షం పాత్ర నిర్వహించవలసింది సిపిఎం సభ్యులే. ఎందువల్లో అనుభవజ్ఞులైన ఉన్నం బసవయ్యను వదిలేసి, యువకుడైన మాదాల వెంకటేశ్వర్లును నాయకుడిగా ఎంపిక చేసింది పార్టీ. వారిలో నాయకుడెవరైనా కట్టుబాటు వుంటుంది. కాబట్టి ఇబ్బంది లేదు. ఉన్నం బసవయ్యను కౌన్సిలలో ఎట్లా మాట్లాడాలో తెలుసు. సాత్వికుడు. తొందరపడడు. కళాకారుడిగా జగమెరిగినవాడు. ఉద్యమాలు నిర్వహించడమూ తెలిసినవాడే.

కాని, కౌన్సిల్‌లో చర్చలనేవి జరుగుతాయా అన్నది సందేహం. గెల్చిన కౌన్సిలర్ల ముఖారవిందాలు చూస్తుంటే రచ్చలు తప్ప, చర్చలు జరిగే అవకాశం కన్పించడం లేదు. చూద్దాం!

# అభినందనలు



నమ్మిన పార్టీకి విధేయత, వడిదుడుకులెదురైనా తొణకని
నిలకడ, నిబ్బరం, నిజాయితీ గల చురుకైన
యువ నాయకుడు, మా కళాశాల కమిటీ కార్యదర్శి

## శ్రీ ఆనం వివేకానంద రెడ్డి గారు

నెల్లూరు మునిసిపల్ ఛేర్మన్‌గా ప్రమాణస్వీకారం చేసిన
శుభసందర్భంలో మా హృదయ పూర్వక అభినందనలు తెలిపుతున్నాము



ప్రిన్సిపల్ మరియు సిబ్బంది

**వి.ఆర్. కళాశాల - నెల్లూరు**





మా దేవస్థానం ధర్మకర్తల మండలి అధ్యక్షుడు
దైవచింతనాపరుడు, యువజన ప్రియుడు

# శ్రీ ఆనం వివేకానంద రెడ్డి గారు

నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్‌గా ఎన్నికైన శుభసందర్భంలో



వేణుగోపాలుని ఆశీర్వచనం
ఆయనకు లభించాలని
భగవదనుగ్రహంతో
అంకిత భావంతో కృషి చేసి
పరిపాలనతో ప్రజల మెప్పు పొందాలని
ఆశిస్తున్నాము, ఆకాంక్షిస్తున్నాము

మువ్వగోపాలుని దయతో
ముందు తరాలకు ఆదర్శప్రాయంగా
నువ్వు పాలనా దక్షుడనిపించుకోవాలి;
ప్రజలందరూ నిన్ను మెచ్చాలి!





ధర్మకర్తల మండలి

## శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానం


రియల్ హీరో చిత్రంలో కృష్ణ, సిల్క్‌స్మిత

# ప్రేక్షకుడు చూసేటప్పుడు బూతుపై ఎందుకింత రచ్చ?

"అల్లుడా.. మజాకా" చిత్రంలో జనాకర్షణీయంగా ఉండడానికి కొన్ని చవక బారు సంభాషణలు, సన్నివేశాలు దొర్లించి ఉండవచ్చు. కాని దాని గురించి ప్రేక్షకుడు ఏ మాత్రం అభ్యంతరం తెలియ జేయనప్పుడు మేము దాని గురించి ఎందుకు మాట్లాడాలి?" అన్నారు హీరో చిరంజీవి. నిర్మాత కె. దేవీ వర ప్రసాద్‌లు; దర్శకుడు ఇ.వి.వి సత్యనారాయణ అయితే మరీనూ- "ఏ సినిమాలోనైనా నీతి, అవినీతి అన్నీ వుంటుంది. చెడు అనేది సినిమాల్లోనే కాదు; అన్ని చోట్లా వుంది. ఏదైనా రిసీవ్ చేసుకునే ధోరణిని బట్టి వుంటుంది. ఇది వ్యాపారం; కొన్ని వందల కుటుంబాల మనుగడకు సంబంధించిన సమస్య. నిర్మాత డబ్బుని నేను దుర్వినియోగం చేయకూడదు. ఇటీవల కామెంట్స్ చేయడమనేది ఫ్యాషన్ అయిపోయింది. విమర్శలు చేసి వాళ్ళు కోరుకునేటట్లు చిత్రాలు తియ్యాలంటే అసలు చిత్రాలు తియ్యనవసరం లేదు. ఈ విమర్శించే వాళ్ల శాతం మూడో నాలుగో వుంటుంది. మిగిలిన వాళ్ళే మాస్. మన సినిమా చూసేది, బ్రతికించేది వాళ్ళే. వాళ్లను దృష్టిలో పెట్టుకుని మేధావులు చిత్రాలు రూపొందించాలి" అన్నారు.

సినిమా సక్సెస్‌కి 'సెక్స్' తప్ప మరో మార్గం లేదా? ద్వంద్వార్థాలు, నటీమణుల నాభి ప్రదేశం, వక్షోజాలు ప్రస్ఫుటంగా కనిపింప జేయడం - ప్రేక్షకుల బలహీనతలను రెచ్చగొట్టి ఎక్స్‌ప్లాయిట్ చేయడం - ఇదే నా సినిమా అంటే? ఆడదాని అంగాలు చూపి సొమ్ము చేసుకోవడమేనా కళా పరిశ్రమ లక్ష్యం?

### విజయశాంతితో విజయమాధవి చిత్రాలు

విజయ శాంతి నాయికగా వడ్డే రమేష్ రెండు చిత్రాలు నిర్మిస్తారు. ఒక దానికి కోడి రామకృష్ణ దర్శకుడు. అది నిర్మాణంలో వుండగానే మరో చిత్రం మొదలవుతుంది. ఈ ఈయన

**చిరంజీవి ఎదురు ప్రశ్న!**

కుమారుడు వెంకట్ వడ్డేతో తెలుగు, తమిళ భాషల్లో ఒక ప్రేమ కథా చిత్రం తయారవుతున్నది.

### ఎం.ఎస్. రెడ్డికి 'డాక్టరేట్'

అన్నామలై విశ్వ విద్యాలయం శత వార్షికోత్సవం సందర్భంగా సాహిత్యంలో విశేష కృషి సల్పిన సహజ కవి, నిర్మాత మల్లెమాల సుందర రామిరెడ్డికి డాక్టరేట్ గౌరవం ఇవ్వబోతున్నారు.

### కోదండరామిరెడ్డి దర్శకత్వంలో చిరంజీవి

మేలో ప్రారంభమయ్యే దర్శక నిర్మాత క్రాంతి కుమార్ చిత్రంలో చిరంజీవి హీరో. ఎ. కోదండ రామిరెడ్డి దర్శకుడు.

### గిరిబాబు దర్శకత్వంలో కృష్ణ

నటుడు గిరిబాబు దర్శకత్వం వహించే "సుడిగాలి" చిత్రంలో కృష్ణ హీరో.

### ఏప్రెల్ 2వారంలో "అమ్మోరు"

"ఆటు పోటులు, అనేక నష్టాలు, అవాంతరాలు, చేదు అనుభవాలు ఎదురైనా, 'అమ్మోరు' చిత్రం అద్వితీయంగా వచ్చింది. ఏప్రెల్ 2వ వారంలో విడుదలకు సిద్ధం చేస్తున్నాం. ఒక భక్తురాలికి, క్షుద్ర భక్తుడికి మధ్య జరిగే ఘర్షణ; భక్తురాలికి, అమ్మోరుకి మధ్య ఆపోహలు మనిషి వెనుకే భగవంతు డున్నాడని చెప్పిన భక్తి రసప్రధాన చిత్రం. అధిక వ్యయ ప్రయాసల కోర్చి అద్వితీయంగా తీశాం" అన్నారు ఎం. శ్యాం ప్రసాద్ రెడ్డి. సురేష్, సౌందర్య, రామిరెడ్డి, బాబూ మోహన్, కళ్లు చిదంబరం, బేబీ సునయన, ఒక కీలకమైన పాత్రలో

(కారవ16 పేజీలో)

# బొంబాయి నిషేధం వెనుక అదృశ్య హస్తమెవరిది?

ఏ మతాన్ని కించపరిచే "బొంబాయి" చిత్రాన్ని రూపొందించ లేదు. మత కలహాల నేపథ్యంలో నలిగి పోయిన ఒక ప్రేమ జంట కథను చిత్రీకరించారు. జాతి సమైక్యతను, సంఘటిత తత్వాన్ని ప్రబోధించే ఈ చిత్రంలో నిషేధించ వలసిన అంశాలేవీ లేవు. అశ్లీల, అసభ్య చిత్రాలను ఏమీ చేయలేని ప్రభుత్వం 'బొంబాయి' వంటి విశాల భావాల వెల్లువను సృష్టించిన కళా ఖండాన్ని నిషేధించడమా?

సెన్సార్ తర్వాత రివైజింగ్ కమిటీ చూసి క్లియరెన్స్ పొందాక చట్ట బద్ధంగా విడుదలైన ఈ చిత్రానికి దేశంలో ఎక్కడా లేని విధంగా జంట నగరాలలోనే ఏకంగా రెండు నెలల పాటు నిషేధం విధించడం విడ్డూరం! ఏ నోట విన్నా ఇది చర్చనీయాంశమైంది. తమిళ నాడులోని ముస్లింలు ఈ చిత్రాన్ని ప్రశంసిస్తున్నారు. వాళ్ళకు తోచని లోపాలు భాగ్యనగర్‌లోని ముస్లింలకు ఎలా స్ఫురించాయి? ఈ నిషేధం వెనుక అజ్ఞాత సినీ ప్రముఖుల హస్తమేదైనా వుందా?

# గాడ్ ఫాదర్

## కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఇంత చచ్చు చిత్రమేమిటి?

ఇటీవలి కోడి రామకృష్ణ చిత్రాలు చూస్తూ వుంటే, ఒకనాడు దర్శకుడిగా సినీ రంగంలో ఒక మెరుపు మెరిసిన కోడి రామకృష్ణేనా ఈ చిత్రాలు తయారు చేస్తున్నది అని ఆశ్చర్యం కలుగుతూ వుంది. ఇప్పుడు ఆయన దర్శకత్వం పట్ల, చిత్రాల పట్ల నమ్మకం పోయింది. ఆయన చిత్రాల కోసం ఆశగా చూస్తున్న వారికి నిరాశే మిగులుతూ వుంది. కొత్తను ప్రోత్సహించడం ఆయన పూర్తిగా మరచి పోయారా అనిపిస్తూ వుంది. వాడిగా, వేడిగా, అన్యాయాల మీద దాడి చేసే పవర్‌ఫుల్, ఎమోషనల్ చిత్రాలు రూపొందించే ప్రతిభ, పట్టుదల ఆయనలో సన్నగిల్లాయా అని తోస్తూ

**గ్రిద్దలూరు గోపాలరావు**

వుంది. వీటన్నింటికి తాజా తార్కాణం "గాడ్ ఫాదర్" చిత్రం.

ఈ చిత్రం టాలూకు కథ యర్రంశెట్టి సాయి వ్రాశారు. దీన్ని కథ అనడం కంటే ఒక పాత అతుకుల బొంత అనడం సబబుగా వుంటుంది. అన్నీ పాత అంశాలే. ఇది వరకు కొన్ని చిత్రాల్లో చూసిన సన్నివేశాలే. కొత్తదనం కొంత కూడా కనిపించదు. రాజశేఖర్ (అక్కినేని నాగేశ్వర రావు) కోటీశ్వరుడు. మందీ మార్బలం, ఫ్యాక్టరీలు, పెద్ద భవంతులు వున్నాయి గాని, భార్యా, పిల్లలు లేరు. విశ్వం (వినుు) అనే చిన్ననాటి స్నేహితు డున్నాడు. విశ్వం తన భార్య కొడుకుతో పేదరికంలో మగ్గుతుంటాడు. కార్మికుల కోసం కృషి చేస్తుంటాడు. రాజశేఖర్‌కు డబ్బుకు తోడు మానవత్వం కూడా ఉంది. ఆయన ఐదు సంవత్సరాలు అమెరికాలో వున్నప్పుడు ఊరి వెలుపల వున్న ఆయన ఖాళీ స్థలాన్ని కొంత మంది ఆక్రమించు కొని ఇళ్లు కట్టుకుంటారు. దానికి రాజా నగర్ కాలని అని నామకరణం చేస్తారు.

రాజశేఖర్ అమెరికా నుంచి తిరిగొచ్చిన తర్వాత తన స్థలంలోని

(కారవ16 పేజీలో)



వి.ఆర్. కాలేజి ఫిజికల్ డైరెక్టర్ జి. దయాకరరెడ్డి కుమారుడు శేఖర్ - స్వాతి వివాహం 12 తేది వి.ఆర్. హైస్కూల్‌లో జరిగింది.

## ప్రభుగిరి పట్నం

6 పేజీ కొరవ

సేకరించారు. ఈ గ్రామానికి పశ్చిమ దిశలో సుమారు 1కి.మీ. దూరంలో వున్న పెద్ద గ్రానైట్ కొండ పైభాగమందు ఒక గుహాలయం వుంది. ఇది చాలా ప్రాచీన కాలం నాటిది. అయితే ఇది విజయనగర రాజుల కాలంలోనే వెలుగులోకి వచ్చింది.

కృష్ణ గుహాలయం వద్ద ఎనిమిది శాసనాలున్నాయని నెల్లూరు జిల్లా మాన్యువల్ తెలుపుతున్నది. అయితే అందు రెండు శాసనాలు మాత్రమే మనకు కొన్ని చారిత్రక వివరాలు తెలియజేస్తున్నాయి. శ్రీకృష్ణ దేవరాయలచే ఉదయగిరి దుర్గ రక్షకుడిగా నియమింపబడిన రాయసం కొండ ముదుసయ్య క్రీ.శ. 151లో ఉదయగిరి దగ్గరలో ఉన్న దాసరి పల్లె గ్రామంను, కందుకూరు దగ్గర గుండాయపాలెంను కృష్ణరాయల పేర దానమిచ్చారు. ఈ దేవాలయం దాసరి పల్లి గ్రామానికి అర్ధ కి.మీ. దూరంలో గ్రానైట్ కొండల పైభాగాన వుంది. ఇది ప్రాచీన కాలం నుండి ఉన్న గుహ. దీనికి లోపలి భాగంలో ఒక సొరంగం వుంది. ఇది ఎంతవరకు ఉన్నదో తెలియదు. గ్రామస్థుల కథనం ప్రకారం ఈ సొరంగం ఉదయగిరి కోటలోకి వెళుతుందని తెలుస్తున్నది. కాని దీనిపై పరిశోధన జరగలేదు. చతురస్రాకారంలో ఉన్న ఈ గుహ లోపలి భాగమంతా చీకటితో నిండి వుంది. అక్కడ ఒక శాసనం ఉన్న స్థంభము, కొన్ని పగిలిన విగ్రహాలు వున్నాయి.

గుహ వెలుపలి పైభాగాన అత్యద్భుతమైన విజయ నగర రాజుల కాలం నాటి చిత్రలేఖనాలు వున్నాయి. అందు హిందూ మతానికి చెందిన దేవతల చిత్రాలు చిత్రించ బడ్డాయి. దురదృష్ట వశాత్తు ఈ చిత్రాలన్నీ శిథిలావస్థలో వున్నాయి. శతాబ్దాలుగా కురియుచున్న వర్షాల కారణంగా చిత్రాలపై పలుచని సున్నపు పొర వంటిది ఏర్పడింది. అందువల్ల చిత్రాలు ఎక్కువ భాగం స్పష్టంగా కనిపించడం లేదు. ఇందులో కుడివైపున "వున్న మల్లయోధులు" చిత్రం మాత్రం అద్భుతంగా కనిపిస్తున్నది. ఇద్దరు మల్ల యోధులు గోదాలో కుస్తీ పడుతున్నట్లుగా వున్న ఈ చిత్రం ఆకర్షణీయంగా వుంది. నెల్లూరు జిల్లాలో మల్ల యుద్ధానికి గల ప్రాధాన్యతను ఈ చిత్రం తెలియ జేస్తుంది. ఈ చిత్రాలు వేయడంలో ఎరుపు, పసుపు, రంగులను ఎక్కువగా వాడారు.

ఈ చిత్రలేఖనాల సంరక్షణ కొరకు పురావస్తు మరియు ప్రదర్శనశాలల శాఖలోని "రసాయనిక పరిశోధన" విభాగం వారు త్వరలో తగు చర్యలు గైకొనవున్నారు.

ఇటువంటి చిత్రలేఖనాలు ప్రభుగిరి పట్టణంలోని శ్రీ పెరుమాళ్ళ స్వామివారి ఆలయంలో ఉండేవని పురాతత్వశాఖ పాత రికార్డులలో వున్నాయని ఇప్పుడు ఏమాత్రం కనిపించకుండా పోయాయి.

### ప్రభుగిరి పట్నం దేవాలయాలు

ఈ గ్రామం పొదలకూరుకు ఉత్తరాన 11కి.మీ. దూరంలో వుంది. ఇది అతి ప్రాచీనమయిన గ్రామం. ఇక్కడ పాత రాతియుగపు పనిముట్లు లభించాయి. బృహత్ శిలాయుగపు సమాధులు (సుమారు క్రీ.పూ. 5వ శతాబ్దం కాలం నాటివి) ఇక్కడ కనుగొన బడ్డాయి.

మధ్య చారిత్రక యుగంలో ఈ గ్రామం ప్రభాక పట్నంగా అనేక శాసనాలలో గుర్తింప బడింది. ఈ గ్రామానికి ఆ పేరెట్లు వచ్చిందో తెలుపుటకు ఆధారాలు లేవు. విజయనగర సామ్రాజ్యంలోని అంతర్భాగమైన ఉదయగిరి రాజ్యంలో ప్రభాకర పట్నం సీమగా అనేక శాసనాలలో పేర్కొనబడింది.

విజయనగర సామ్రాజ్యాధినేత శ్రీ అచ్యుత దేవరాయ మహారాజు కాలంనాటి (క్రీ.శ. 1525) శాసనం ప్రకారం ప్రభాకర పట్నం సీమలోని కనపర్తి గ్రామం ఉదయగిరిలోని ఒక దేవాలయానికి దానం చేయబడింది. ఇదే కాలానికి చెందిన మరి రెండు శాసనాలలో కూడా ప్రభాకర పట్నం సీమను గురించి ప్రస్తావించారు.

నెల్లూరు జిల్లాలో చక్కటి శిల్ప కళారీతులున్న ప్రముఖ దేవాలయాలలో కృష్ణపట్నం గ్రామంలోని సిద్ధేశ్వర స్వామి దేవాలయం, మల్లాంలోని శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయం, ఉదయగిరిలోని శ్రీ రంగనాయక స్వామి దేవాలయం, వేణుగోపాల స్వామి దేవాలయం, శ్రీ వల్లభరాయ స్వామి దేవాలయం ముఖ్యమైనవిగా గుర్తించ బడ్డాయి. అంతటి శిల్పకళా వైభవం వున్న రెండు దేవాలయాలు ప్రభుగిరి పట్నం గ్రామంలో వున్నాయి.

### శ్రీ పెరుమాళ్ళ స్వామి దేవాలయం

విజయనగర రాజుల కాలం నాటి ఈ విష్ణ్వాలయం గ్రామ మొగుదలలో వుంది. ఇది పాక్షికంగా శిథిలమైంది. ఇందు గర్భ గృహం, అంతరాళం, మండపం, వరండా భాగాలు వున్నాయి. గర్భ గృహం పూర్తిగా శిథిలమైంది. మండపం గోడలు కూడా పడిపోయాయి. ఈ గోడలపై రామాయణ, మహాభారతానికి సంబంధించిన అనేక సంఘటనలకు సంబంధించిన శిల్పాలు చెక్కబడి వున్నాయి.

ఈ దేవాలయం వద్ద క్రీ.శ. 1602-03 కు చెందిన శాసనం ఒకటి వుంది. ఇందులో శ్రీ వీర ప్రతాప శ్రీ వెంకటరాయ మహారాజులు విజయ నగర సింహాసనారూఢులై ఉండగా ఉదయగిరి రాజ్యానికి మహా మండలేశ్వరునిగా వున్న శ్రీ "ముద్దయ్య దేవ మహారాజు" ప్రభాకర పట్నంలోని చెన్నకేశవ స్వామి ఆలయ నిర్వహణ కోసం పందిరాయుని గ్రామాన్ని దానం చేశారు. ఈ దేవాలయం పురావస్తు మరియు ప్రదర్శన శాలల శాఖ వారి సంరక్షణలో వున్నది. శిథిలమైన శ్రీ పెరుమాళ్ళ స్వామి దేవాలయాన్ని పునర్నించాలనే ఉద్దేశ్యంతో పురావస్తు మరియు ప్రదర్శనశాలల శాఖ వారు 1990-91 ఆర్థిక సంవత్సరంలో 3 లక్షల రూపాయలు తొలివిడతగా విడుదల చేశారు. కానీ గ్రామస్థులు మూర్ఖపు పట్టుదలతో దేవాలయాన్ని బాగుచేయ నివ్వలేదు. పురావస్తు శాఖాధికారులు, రెవిన్యూ అధికారులు ఎంత మంది చెప్పినా దేవాలయాన్ని బాగుచేయించడానికి గ్రామస్థులు ఒప్పుకోలేదు. దీని వల్ల ఒక చక్కటి దేవాలయాన్ని శాశ్వతంగా నిలబెట్టు కోవాల్సిన అదృష్టాన్ని కోల్పోయాం.

### శివాలయం

చక్కగా చెక్కిన గ్రానైట్ రాళ్ళతో నిర్మింపబడిన ఈ దేవాలయం నందు కూడా గర్భ గృహ, అంతరాళం, మండపం, భాగాలున్నాయి. ఇక్కడ భైరవ, వీరభద్ర, పార్వతి, షణ్ముక విగ్రహాలు వున్నాయి. ఇందులో షణ్ముకుని విగ్రహం విలక్షణ మైంది. ఈ విగ్రహం ఆరు శిరస్సులు వరుసగా లేకుండా ముందుభాగాన మూడు వెనుక మూడు శిరస్సులు కలిగి వున్నది.

(సమాప్తం)





## చిత్రసమీక్ష

15 పేజీ కొరవ

ఆక్రమణ దారులను ఖాళీ చెయ్యమంటారు; కాని వాళ్లు ఖాళీ చెయ్యరు. ఆ కాలనీలోని వారంతా కిరాయి గుండాలుగా, దొంగలుగా, మోసగాళ్లుగా బ్రతుకు తుంటారు. ఆ బస్తీలోని రాజకీయ నాయకుడు కాస్ట్యూమ్స్ కృష్ణ ఈ కిరాయి గుండాలను బాగా ఉపయోగించు కుంటూ వుంటాడు. ఆ కాలనీలోని ఆక్రమణ దారులను ఖాళీ చెయించి ఆ స్థలం ఆక్రమించు కోవాలని ఆ రాజకీయ నాయకుడు తన మనుషులతో ఆ కాలనీ వాసుల మీద దౌర్జన్యాలు జరిపిస్తూ వుంటాడు. ఇదంతా రాజశేఖర్ జరిపిస్తున్నట్లు ప్రచారం సాగుతుంది. ఆ కాలనీ వాసులకు నాయకుడైన శంకర్ (వినోద్ కుమార్) తమ కాలనీ మీద కక్ష గట్టిన రాజశేఖర్‌ను హతమారుస్తానని శపథం చేస్తాడు. ఇది తెలిసిన రాజశేఖర్, ఆ కాలనీ వాసుల్లో మార్పు తీసుకొచ్చేందుకు వంద రోజులు ఆ కాలనీలో ఒక మామూలు మనిషిగా కాపురం పెట్టాడు. తన ఎస్టేటు నంతా తన ప్రాణ స్నేహితుడికి వంద రోజులు అప్పగిస్తాడు. ఆ కాలనీ వాసుల్లో మార్పు తీసుకొస్తాడు ఇది కథ.

కథ చాలా పేలవంగా వుంది. కథనం అంత కంటే బలహీనంగా వుంది. ఏ సన్నివేశమూ పకడ్బందీగా కుదరలేదు. రాజశేఖర్‌ను హతమార్చాలను కున్న కిరాయి గూండా శంకర్, రాజశేఖర్‌ను చూచేందుకు ప్రయత్నం చెయ్యక పోవడం, రాజశేఖర్ ఒక మామూలు మనిషిగా కాలనీకి వచ్చి తానే రాజశేఖర్ అని చెప్పినప్పుడే శంకర్ ఆ మాట నమ్మక పోవడం, అతడ్ని గురించి ఆచూకీ తియ్యక పోవడం చాలా లోపంగా కనిపిస్తుంది. ఇలా చెప్పుకు పోతుంటే చచ్చుదనం చాలా వుంది.

ఒక్క రాజశేఖర్ పాత్ర తప్ప ఏ పాత్రలోనూ జీవత్వం కనిపించదు. ఏ పాత్రా ప్రేక్షకుల దృష్టిలో ఆనదు. ఇద్దరు హీరోయిన్ల పాత్రలు పసమ దండగగా కనిపిస్తాయి. ఒక హీరోయిన్ డాక్టర్ (కస్తూరి). ఆమె శంకర్‌కు జోడి. మరో హీరోయిన్ వాణీ విశ్వనాథ్, విల్లి ఎల్ల యువకుడు రాజశేఖర్‌కు తోడు నీడా. రాజశేఖర్‌ను ఊహించు కుంటూ గంటల్ ఆయనతో కులుకు తుంది. నటించే అవకాశం యిద్దరు హీరోయిన్లకు ఎక్కడా చిక్కలేదు. రాజశేఖర్‌గా వాగేశ్వర రావుకూ అదే గతి పట్టింది. శంకర్‌గా వినోద్ కుమార్ కేకలు వెయ్యడం, ఫైటింగులకే పరిమిత మయ్యాడు. విను మాటల గారడితో విశ్వం పాత్రను నటిపాడు. కోట శ్రీనివాస రావు మాజీ ముఖ్యమంత్రి కుడి భుజంగా రచ్చచేశారు. బాబూమోహన్, అనంత్ హాస్యం అందించ లేక పోయారు.

చిత్రం సంభాషణల మీద సాగుతుంది. అందువల్లనే విసుగెత్తు తుంది. ఒక్కో పాత్ర గుక్క తిప్పుకోకుండా మాట్లాడుతుంది. సత్యానంద్ మాటలు చాలా చోట్ల చప్పగా వున్నాయి.


సినిమా
15 పేజీ కొరవ


రమ్యకృష్ణ నటించారు. మాటలు: సత్యానంద్. పాటలు: మల్లెమాల, సంగీతం: చక్రవర్తి, దర్శకత్వం: కోడి రామకృష్ణ.

### సౌందర్య తండ్రి నిర్మించే చిత్రం

సౌందర్య తండ్రి సత్య నారాయణ కథ వ్రాసి, నిర్మించే "జీవిత చట్రం" రాజేంద్ర బాబు దర్శకత్వంలో తెలుగులోనూ; కన్నడంలో "సమస్య"గాను ప్రారంభ మౌతుంది. దాసరి నారాయణ రావు, సౌందర్య, వినోద్ కుమార్ ముఖ్య పాత్రధారులు.

### పి. వాసు దర్శకత్వంలో రాజశేఖర్

తమిళ దర్శకుడు పి. వాసు సొంతంగా తెలుగు, తమిళ భాషల్లో ఒక చిత్రాన్ని నిర్మించ బోతున్నారు. రెండింటిలోనూ హీరో రాజశేఖర్.

### అయోమయంగా వున్న తెలుగు సినిమా

"చలన చిత్ర పరిశ్రమ నుంచి వచ్చిన వ్యక్తి గనుక చిత్ర సీమలోని పలు సమస్యలపట్ల పరిపూర్ణమైన అవగాహన వున్న ముఖ్య మంత్రి ఎన్.టి.ఆర్. మూలంగా తమ కోర్కెలు నెరవేర్చు కోవచ్చునన్న ఆశాభావంతో ఇటీవల తెలుగు చలన చిత్ర పరిశ్రమ ప్రతినిధి వర్గం ఆయన్ని కలిసి, ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించింది. దాన్ని ఒకటికి రెండు సార్లు చదివి పని నన్రతివారు చెప్పే ఏవేవో సమస్యలు వింటూంటే ఇదేమైనా మాయ జాలమా అనిపిస్తోంది. ఇదివరకటి నిర్దుష్టమైన పద్ధతులు ఇప్పుడు ఏమైనాయి? ఇప్పటి సినిమా పరిస్థితులను పూర్తిగా పరిశీలించాలి. సమస్యలేవైనా వుంటే బాగా అవగాహన చేసుకుని, తగు పరిష్కార మార్గాలను అన్వేషిస్తాం అని ఎన్‌టిఆర్ చిన్న సైజు గంభీరో పన్యాసం ఇచ్చేసరికి మహజరు సమర్పించు కున్న వారంతా ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

# స్నేహసుమాంజలి



కష్టాలెన్ని వచ్చినా కలతచెందని గుండెనిబ్బరం,
వత్తిడులెన్ని వచ్చినా కదలికన్నది లేని పార్టీ విధేయత,
పరాజయాలెన్ని ఎదురైనా అలుపన్నది ఎరుగని పట్టుదల,
పదవిలో వున్నా లేకున్నా ప్రజల మనిషిగా మెలిగే

# శ్రీ ఆనం వివేకానంద రెడ్డి గారు

నెల్లూరు మునిసిపల్ ఛేర్మన్‌గా ప్రమాణ
స్వీకారం చేసిన శుభసందర్భంలో

## మా హృదయ పూర్వక శుభాకాంక్షలు

**రేబాల వెంకట రెడ్డి - చెరుకుపల్లి తిరుపాల్ రెడ్డి**

## మునిసిపాలిటీలు

4 పేజీ తరువాయి

తీసుకొని, కొంతకాలం వున్నారు. తర్వాత 1896 జూలైలో ప్రొబేషనరీ డిప్యూటీ కలెక్టరు పి. సీతారామయ్య చైర్మన్ అయి, డిసెంబరు 18 తేదిదాకా పదవిలో వున్నారు. ఆయన గోదావరి జిల్లాకు ట్రాన్స్‌ఫరై పోయిన తర్వాత, 1898 మార్చి 21 తేది నుంచి 1903 డిసెంబరు 28 తేది దాకా ఎస్. వి. రంగాచార్యులు చైర్మన్‌గా వున్నారు. తర్వాత ఒక సంవత్సరం ఆర్. డి. ఓ ఎక్స్ అఫిషియో చైర్మన్‌గా వుండి 1904 మార్చి 8 తేదిన సి. శేషాద్రిరావు పంతులుగారికి చార్జి అప్పగించారు. శేషాద్రిరావు పంతులు మూడేళ్ళు చైర్మన్‌గా వున్నారు. ఆయన తదనంతరం ప్రముఖ న్యాయవాది టి. వి. వెంకట్రామయ్యర్ చైర్మన్‌గా నియమింప బడ్డారు. ఆయన 1907 మార్చి 15 తేదిన పదవి బాధ్యత స్వీకరించి, 1908 ఏప్రెల్ 23 తేదిదాకా కొనసాగారు. తర్వాత ఆర్.డి.ఓ. వి. పార్థసారథి శెట్టిగారు ఎక్స్ అఫిషియో చైర్మన్‌గా రెండు నెలలు వున్నారు.

తర్వాత 1908 జూలై 14 తేదిన తిరిగి సి. శేషాద్రిరావు పంతులు గార్ని చైర్మన్‌గా ప్రభుత్వం నియమించింది. ఆయన ఇంచుమించు రెండేళ్లున్నారు. 1910 మార్చి 19 తేదిన ఆయన కౌన్సిల్ సభ్యత్వం గడువు పూర్తికావడంతో, చైర్మెన్ పదవికూడా ఊడిపోయింది.

శేషాద్రిరావు పంతులుగారి తర్వాత ప్రసిద్ధ న్యాయవాది మైదవోలు చెంగయ్య పంతుల్ని 1910 ఏప్రెల్ 12 తేదిన చైర్మన్‌గా నియమించారు; ఆయన కూడా కౌన్సిల్ సభ్యత్వం పూర్తికావడంతో, 1911 మే 5 తేదిన పదవినుంచి విరమించు కున్నారు.

ఐతే ప్రభుత్వం తిరిగి అదే రోజున చెంగయ్య పంతులుగార్ని ఎక్స్ అఫిషియో సభ్యుడుగా నియమించి, చైర్మెన్‌గా కొనసాగేట్టు చేసింది. తర్వాత ఆయన రెండేళ్లపాటు పదవిలో వుండి, 1913 మే 9 తేదిన విరమించుకున్నారు.

అప్పటిదాకా మునిసిపల్ చైర్మన్ పదవి ఒక మ్యూజికల్ ఛైర్ మాదిరి వుంటుండేది. ప్రజాభిప్రాయంతో ఏ సంబంధమూ లేకుండా ప్రభుత్వం తనకు నచ్చినవార్ని చైర్మన్‌గా నియమిస్తుండేది. తర్వాత 1913 జూలై 3 తేదిన ఈ పద్ధతికి స్వస్తిచెప్పి మళ్ళీ కౌన్సిల్ సభ్యులు చైర్మన్‌ను ఎన్నుకునే 'ప్రజాస్వామిక' పద్ధతిని ప్రవేశ పెట్టారు. దాంతోపాటు కౌన్సిల్‌లో 'పౌర ప్రతినిధుల' సంఖ్యకూడా పెంచారు. మొత్తం 18 కౌన్సిల్ స్థానాల్లో అప్పటిదాకా సగం మందిని మాత్రమే [illegible] ఎన్నుకుంటుండేవారు; ఇప్పుడా [illegible] డింట రెండొ,ంతులు చేశారు. అంటే పన్నెండు మంది కౌన్సిలర్లను ప్రజలు ఎన్నుకొనే వారు.

ఈ కొత్త పద్ధతి ననుసరించి 1913 ఆగస్టు 30 తేదిన వావిలి కొలను నరసింగరావుగారు చైర్మన్‌గా ఎన్నికై, అక్టోబరు 2తేదిన చార్జి తీసుకున్నారు. ఐతే ఆయన ఒక్క సంవత్సరమైనా ఆ పదవిలో వుండలేదు. 1914 సెప్టెంబరు 26తేదిన పదవి విరమణ చేశారు. ఆయన తర్వాత చైర్మన్‌గా ఎన్నికైనవారు ఆనాటి ఉపాధ్యాయ ప్రముఖుడు, వి.ఆర్. స్కూలు హెడ్మాస్టరు అయిన ఎ. సంతానరామయ్యంగార్. ఈయన 1914 డిసెంబరు 17 తేదిన చైర్మన్‌గా ఎన్నికై, 1915 జనవరి 21 తేదిన పదవి బాధ్యత స్వీకరించి, 1917 జూలై 20 దాకా పదవిలో వున్నారు. అప్పట్లో సుంకు కృష్ణస్వామి శెట్టి వైస్ ఛైర్మన్‌గా వుండేవారు. సంతాన రామయ్యంగార్ తర్వాత, కృష్ణస్వామి శెట్టి మూడు నెలలు ఇన్‌చార్జి చైర్మన్‌గా వున్నారు.

ఆటు తర్వాత జరిగిన ఎన్నికల్లో ఆమంచర్ల సుబ్బు కృష్ణారావు గారు చైర్మనయ్యారు. ఆయన 1917 అక్టోబరు 16 తేది నుంచి, 1919 అక్టోబరు 15 దాకా పదవిలో వున్నారు. తర్వాత అప్పటి వైస్ చైర్మన్ లాయరు మహమద్ యాహ్యాలి సాహెబ్ నాలుగునెలల పాటు ఇన్‌చార్జ్ చైర్మన్‌గా వున్నారు.

తిరిగి 1919 నవంబరు 15 తేదిన న్యాయవాది మాడభూషి నరసింహాచార్యులను చైర్మన్‌గా ఎన్నుకున్నారు. ఆయన పదవి కాలం 1921 జూన్ 4తేదితో పూర్తయిన తర్వాత, ఎన్నికల్లో మళ్ళీ యహ్యాలిసాహెబ్ ఛైర్మనయి, 1926 ఆగస్టు 24తేదిన రాజీనామా చేశారు. తర్వాత ఐదంటే ఐదే రోజులు, వైస్ ఛైర్మెన్ విస్సా రాజగోపాలరావు ఇన్‌ఛార్జి ఛైర్మన్‌గా వున్నారు.

1926 మార్చి 31 తేదిన తిక్కవరపు రామరెడ్డిగార్ని ఛైర్మన్‌గా ఎన్నుకున్నారు; ఆయన దాదాపు నాలుగేళ్ళు పదవిలో వుండి 1930 జూలై 29 తేదిన రాజీనామా చేశారు. అప్పట్లో వైస్ ఛైర్మన్‌గా వుండిన అన్నదేవుల గోవిందరెడ్డి ఇన్‌చార్జి చేర్మనై, తర్వాత 1930 ఆగష్టు 2తేదిన చేర్మన్ అయ్యారు. ఆయన 1931 నవంబరు 30 తేదిదాకా పదవిలో వున్నారు. తర్వాత మళ్ళీ యాహ్యాలిసాహెబ్ - 1931 డిసెంబరు 14 తేదిన ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. అప్పట్లో ఆయన లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడుకూడా.

యాహ్యాలిసాహెబ్‌గారు 1936 జూన్ 4తేది దాకా ఛైర్మన్‌గా వున్నారు. ఆయన తర్వాత వైస్ ఛైర్మనైన రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు జూన్ 12 తేదిన ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. ఆయన 1937 జనవరి 27 తేదిన రాజీనామా చేశారు. అప్పటి వైస్ ఛైర్మన్ ముంగమూరి విశ్వనాథరావు ఇన్‌చార్జి ఛైర్మన్‌గా పదకొండు రోజులు వ్యవహరించిన తర్వాత, 1937 ఫిబ్రవరి 8 తేదిన ఎ.సి. సుబ్బారెడ్డిగారు ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు.

ఆరు నెలల తర్వాత 1937 జనవరి 28 తేదిన తిరిగి ఆర్.ఎల్. రెడ్డిగారు [illegible], సరిగ్గా ఆరునెలలకు జూలై 27 [illegible] విరమించుకున్నారు. తర్వాత మళ్లీ ఎసి సుబ్బారెడ్డిగారు జూలై 28 నుంచి 1942 సెప్టెంబరు 7 తేదిదాకా ఛైర్మన్‌గా వున్నారు. మధ్యలో ఒక నెల ఎక్స్‌అఫిషియో ఛైర్మన్‌గా డి. సుబ్బారాయ శాస్త్రి, ఇన్‌చార్జి ఛైర్మన్‌గా సుంకు చెంగల్రాయ శెట్టి మాత్రం వున్నారు.

మళ్ళీ 1943 మార్చి 17 తేదిన ఆర్. ఎల్. రెడ్డిగారు ఛైర్మనై, 1947 జనవరి 13 దాకా వున్నారు. తర్వాత 1947 అక్టోబరు 15 తేదిన తిరిగి ఎ.సి. చేతికే మునిసిపాలిటీ పెత్తనం వచ్చింది. అప్పట్నుంచి దాదాపు పదమూడేళ్ళపాటు ఆయన ఏకచ్ఛత్రాధి పత్యంగా పాలించి, 1960 జనవరి 25 తేదిన విరమించుకున్నారు. ఆ మర్నాడే షేక్ మహబూబ్ బాషా ఛైర్మనై 1962 డిసెంబరు 8 తేది దాకా వున్నారు. తర్వాత ఒక నెల పి.వి.సుబ్బారెడ్డి ఇన్‌చార్జిగా వున్నారు.

1963 జనవరి 30 తేదిన పిడూరు లక్ష్మణగుప్త ఛైర్మనై, 64 సెప్టెంబరు 30 తేదిదాకా వున్నారు. తర్వాత 1967 సెప్టెంబరు 30 తేది దాకా స్పెషలాఫీసరు పాలన. 1967 లో జరిగిన ఎన్నికలలో ఆనం వెంకటరెడ్డి ఛైర్మనై, అక్టోబరు 1తేదిన చార్జితీసుకొని, 1972 సెప్టెంబరు 30 దాకా వున్నారు. అప్పట్నుంచి స్పెషలాఫీసరు పాలనలో వున్నది. తిరిగి 1981 ఆగష్టు వరకు. [illegible]బ దాదాపు తొమ్మిదేళ్లు పూర్తిగా మునిసిపాలిటీకి ఎన్నికలు జరగలేదు. 81 ఆగస్టు 9తేది జరిగిన ఎన్నికలలో చేర్మన్ స్థానం గిరిజన రిజర్వుడైంది. శ్రీ రావుమాలకొండయ్య ఛైర్మన్‌గా, శ్రీ ఆనం వివేకానందరెడ్డి వైస్ ఛైర్మన్‌గా ఎన్నికైనారు. ఆ కౌన్సిల్ పలు అవినీతి ఆరోపణలతో పూర్తికాలం పనిచేయకుండానే రద్దు అయిపోయింది. స్పెషలాఫీసరు పాలనలో రెండేళ్లు గడిపిన తర్వాత తిరిగి 1987 మార్చి 18 తేది ఎన్నికలు జరిగాయి. శ్రీ టి. రమేష్‌రెడ్డి ఛైర్మన్‌గా, శ్రీ పుట్టాబలరామరెడ్డి వైస్ ఛైర్మన్‌గా ఎన్నికైనారు. వీరు ఐదేళ్ల పరిపాలించారు. 1992 నుంచి మళ్ళీ మునిసిపాలిటీకి స్పెషలాఫీసరు పాలనే గతి అయింది.

ఇకపోతే వార్డుల విభజన, కౌన్సిలర్ల సంఖ్యను గూర్చి రెండు మాటలు-

నెల్లూరు మునిసిపాలిటీ పేరుకు 1866 లోనే ఏర్పడినా, అది నిజమైన మునిసిపాలిటీ రూపాన్ని సంతరించుకున్నది 1885 లోనే; ఆ సంవత్సరం మొట్ట మొదటిసారిగా మునిసిపాలిటీకి పన్నెండు మందికి తక్కువ కాకుండా కౌన్సిలర్లుండాలని; వారి పదవీకాలం మూడేళ్ళని ప్రభుత్వం నిర్దేశించింది. తర్వాత 1920 లో మునిసిపాలిటీ చట్టంలో పెద్దమార్పు వచ్చింది. దాని ప్రకారం మునిసిపాలిటీ లోని జనాభానుబట్టి కౌన్సిలర్ల నిర్ణయమవుతుంది. మొత్తమ్మీద ఆ సంఖ్య 16 కు తగ్గకుండా, 36 కు మించకుండా వుండాలి; అందులో ప్రజలచే ఎన్నుకోబడినవారు ముక్కాలు వంతుకు తక్కువ కాకుండా వుండాలి.

తర్వాత 1930 లో మునిసిపాలిటీ చట్టాన్ని మరోకసారి సవరించి, మునిసిపల్ కౌన్సిలర్లను నామినేట్ చేసే పద్ధతికి స్వస్తిచెప్పి, అందర్నీ ప్రజలే ఎన్నుకొనే పద్ధతిని ప్రవేశ పెట్టారు. అంతేకాకుండా, అప్పటిదాకా మహిళలు ఎన్నికల్లో పోటీ చెయ్యకూడదన్న నిషేధాన్ని తొలగించడం కూడా జరిగింది. పైగా స్త్రీలకు రిజర్వేషను కూడా ప్రవేశ పెట్టారు; ముస్లిములు, క్రైస్తవులు, షెడ్యూల్డు కులాలు, యూరోపియన్లు ఆంగ్లో యిండియన్లుకు కూడా రిజర్వేషన్లు ఏర్పర్చారు.

1930 నాటి ఈ సవరణ ననుసరించి, నెల్లూరు టౌను 22 వార్డులుగా విభజించారు; కౌన్సిల్ స్థానాలు 28 చేశారు. అంటే ఆరు రిజర్వుడు స్థానాలయ్యాయన్న మాట. అవి ముస్లిములకు మూడు, ఆది ఆంధ్రులకు ఒకటి, క్రైస్తవులకు ఒకటి స్త్రీలకు ఒకటి; తర్వాత 1947-48 లో కౌన్సిలర్ల సంఖ్య 33 కు పెరిగింది; ఇప్పుడు మహిళలకు, షెడ్యూల్డు కులాల వారికి చెరి రెండేసి స్థానాలు; ముస్లిములకు నాలుగు స్థానాలు; క్రైస్తవులకు ఒక్కస్థానం రిజర్వయ్యాయి.

1950 లో రాజ్యాంగం వయోజన ఓటింగ్ ప్రవేశ పెట్టడంతో, రేట్ పేయర్లు మాత్రమే ఓటర్లుగా వుండే పద్ధతిపోయి, 1952 లో జరిగిన మునిసిపల్ ఎన్నికల్లో పౌరులందరూ ఓటర్లయ్యారు. అప్పట్లో వార్డుల సంఖ్య 28 కి పెంచి కౌన్సిలర్ల సంఖ్య 32 కు తగ్గించారు. రిజర్వేషన్లు షెడ్యూల్డు కులాలకు రెండు, మహిళలకు రెండు; మిగతా రిజర్వేషన్లు రద్దయిపోయాయి.

తర్వాత నెల్లూరు మునిసిపాలిటీ చరిత్రలో చెప్పుకోదగిన పెద్దమార్పు-1961 మార్చిలో స్పెషల్ గ్రేడ్ మునిసిపాలిటీగా గుర్తింపు పొందడం. తిరిగి 1965 లో కౌన్సిలర్ల సంఖ్యలో మార్పు వచ్చింది. నెల్లూరు టౌన్ 29 వార్డులుగా విభజించారు; కౌన్సిల్ స్థానాలను 36 కు పెంచారు. మహిళలకు రెండు షెడ్యూల్డు తెగలకు మూడు, షెడ్యూల్డు కులాలకు రెండు స్థానాలు ప్రత్యేకించారు. వీరుకాక యిద్దరు ఎక్స్ అఫిషియో కౌన్సిలర్లు ముగురు ఆల్డర్‌మెన్ వుండేవారు. 1981లో మరోకసారి వార్డుల పునర్విభజన జరిగింది. మొత్తం వార్డులను 28 కి తగ్గించారు. కాని మొత్తం కౌన్సిలర్ల సంఖ్యమాత్రం 36. 1965 సంవత్సరం నుంచి దీనిలో మార్పులేదు. 8 మంది రిజర్వుడు కౌన్సిలర్లు- హరిజన, గిరిజనులకు మూడేసి, మహిళలకు రెండు; ఆల్డర్‌మెన్ పద్ధతి రద్దయి పోయింది.

1987లో మళ్లీ మార్పులు; కౌన్సిల్ స్థానాలను 44 కు పెంచారు. వీటిలో మూడు ఎస్‌టి లకు, ఆరు ఎస్‌సిలకు, నాలుగు స్త్రీలకు, తొమ్మిది వెనుక బడిన తరగతులకు కేటాయించారు. 1995 లో కౌన్సిల్ స్థానాలు మారక పోయినా రిజర్వేషన్లు మారాయి. 15 స్థానాలు జనరల్‌కాగా 10 బిసిలకు, 5 బిసి మహిళలకు, 3 ఎస్‌సి లకు, 2ఎస్‌సి మహిళలకు, ఎస్‌టి రెండు వార్డుల్లో స్త్రీలకు, పురుషులకు చెరొకటి లెక్కన కేటాయించారు. సూక్ష్మంగా ఇదీ మన మునిసిపాలిటీ నూరేళ్ళ చరిత్ర. స్పెషలాఫీసర్లు, ఎక్స్‌అఫిషియో ప్రెసిడెంట్లను కూడా లెక్కలోకి తీసుకొంటే 1874 నుంచి ఈనాటి వరకు మన మునిసిపాలిటీని 54 మంది ఛైర్మన్లు పాలించారు; ప్రస్తుతం ఆనం వివేకానందరెడ్డి 55 వ ఛైర్మన్ అవుతున్నారు

మునిసిపాలిటీకి ఎప్పుడూ నూరేళ్లు నిండినా, శతజయంతి జరగ లేదన్న అసంతృప్తి అట్లనే వుండి పోయింది. వివేకానందరెడ్డి కాప్పుడైనా పూనుకొని ఆ ముచ్చట తీరిస్తే సింహపురీయులు సంతోషిస్తారు.

-జమీన్‌రైతు పాత సంచికల ఆధారంగా పునర్ముద్రితం!

## సణుగుడు

6 పేజీ తరువాయి

చెసుకొని వుంటే పరిస్థితి ఇంత దూరం వచ్చుండా?

టిక్కెట్ల పంపకం సమయంలో రమేష్‌రెడ్డి తన స్వంత అభ్యర్థికి టిక్కెట్ ఇప్పించుకోవడానికి ప్రయత్నించాడన్నది నైటికి కష్టం కల్గించిన విషయం. కాని రాజకీయాలలో తమ వారికి పదవు లిప్పించు కోవడానికి ఏ ఎమ్మెల్యే అయినా ప్రయత్నించడంలో తప్పేముంది? ఆ కష్టం మనసులో పెట్టుకొని నైటి నాయుడు అనవసరంగా రమేష్ రెడ్డితో శత్రుత్వం పెంచుకున్నారు. ఆయన్ను కలిసి ఓటు అడగడానికి ఇష్టం చూపలేదు. అవసరం తనది కాబట్టి, తాను చొరవ తీసుకొని రమేష్ రెడ్డిని ఒప్పించి, కలిసి తిరిగి వుంటే ఈ పరిస్థితి వచ్చేది కాదు కదా? గెలుపు పట్ల విశ్వాసంతో స్వాభిమానానికి పోయి ఇప్పుడు ఉక్రోష పడి లాభమేమిటి? తాను అవమానింప బడ్డా నన్న బాం [illegible] తో ప్రచారంలో అంటీ ముట్టనట్లు వ్యవహరించి [illegible] రమేష్ రెడ్డి కంటే నికరమైన ఎన్టీఆర్ అభిమాని, నిఖార్సయిన తెలుగు దేశం వాది ఆ పార్టీలో మరొకరెవరుంటారు? రమేష్ రెడ్డి పట్ల ఎన్టీఆర్ మనసు విరిచేందుకు ప్రయత్నించడం కేవలం హాస్యాస్పదం. వారిద్దరి మధ్య వున్న అనుబంధం ఒకరు తెంపితే తెగిపోయేదా చెప్పండి!

తన ఓటమికి కారకులనే ఆపోహతో మునిసిపల్ కమీషనర్, ఇంజనీరు, నెల్లూరు పోలీసు డిఎస్‌పి వంటి అధికారులను వున్న పళంగా బదలీ చేయమని పట్టు బట్టడం మరీ మూర్ఖంగా వుంది. అధికారులు చెప్పే జనం [illegible]స్తారా? లేని ఓట్లు వున్నట్లు చూపి ఏ అధికారి అయినా ఒక అభ్యర్థిని గెలిపించ గలరా? అందులోనూ ప్రభుత్వంలో వున్న పార్టీని కాదని, ప్రతిపక్షం అభ్యర్థికి పోలీసులు సహకరిస్తారని భావిస్తే అది అమాయ కత్వమౌతుంది! కౌంటింగ్ కేంద్రంలో, కౌంటింగ్ నిర్వహించే అధికారుల పై చేయి చేసుకోవడం, దుర్భాష లాడడం, నంప బోవడం జరుగు తుంటే ఏ డిఎస్‌పి అయినా చూస్తూ ఎట్లా పూరకుంద గలడు? దాన్ని నివారిస్తే అది ఆ అధికారి నేరమౌ తుందా?

ఎన్నికలలో సహకరించ లేదని అధికారులను బదలీ చేయమనడం దుర్మార్గం. ప్రజాస్వామ్య సాంప్రదాయాలకు పూర్తి విరుద్ధమది! నైటి నాయుడు అంత అనుభవం వుండి ఇంత స్వల్పంగా ఎందుకు ప్రవర్తిస్తున్నారో అర్థం కావడం లేదు. ఆయన ఓటమి విచార కరమైనది. అందులో సందేహం లేదు. రాక రాక ఒక పదవీ అవకాశం వస్తే అది చేతి నుంచి [illegible] కంచి లోగా జారి క్రింద పడి పోవడం దిగులు పడాల్సిన విషయమే. అంత మాత్రానికి విచక్షణ కోల్పోయి ప్రవర్తించడం మంచిది కాదు. ఈ సంఘటనల వల్ల నైటికి ప్రజలలో ఏర్పడిన ఓటమి సానుభూతి తొలగి పోయి, విముఖభావం ఏర్పడు తున్నది. రాజకీయ భవిష్యత్ కోరుకునే వారికిది చాలా ప్రమాద కరం. నైటి అప్పటికైనా తన తప్పు తెలుసుకొని సంయమనంతో వ్యవహరించ గల్గితే మరొక అవకాశంలో ప్రజల మద్దతు పొంద గల్గుతారు.



పౌరాణిక నాటక పంచకం సందర్భంలో ప్రముఖ రంగస్థల నటుడు శ్రీ పొన్నాల రామ సుబ్బారెడ్డిని సన్మానిస్తున్న బి. చిదంబరం చిత్రంలో సిసి. సుబ్బరాయుడు, ఒమ్మిన సుబ్రహ్మణ్యం కూడా వున్నారు

## నెల్లూరు సంగతులు

5 పేజీ కొరవ

కార్యదర్శులు పి.వి. రమణా రెడ్డి, బి.వి. నరసింహులు.

### గీతా వసంత నవరాత్రులు!

శారదా సాహితీ సంస్థ యువ నామ సంవత్సరాన్ని పురస్కరించుకొని రాయాజీ వీధిలోని ఆంజనేయ స్వామి దేవాలయంలో 1 తేది నుండి 10 తేది వరకు ప్రత్యేక కార్యక్రమాలు ఏర్పాటు చేసింది. 1 తేది పంచాంగ శ్రవణం, యువ కవి సమ్మేళనం. 2 తేది విషాద సాంఖ్య యోగాల గూర్చి గోనుకొండ వెంకట సుబ్బయ్య వివరిస్తారు. 3 తేది కర్మ జ్ఞాన యోగాలను పచ్చి పులుసు వెంకటేశ్వర్లు, 4 తేది కర్మ సన్యాస ఆత్మ సంయమ యోగాలను ఉప్పల వెంకట సుబ్రహ్మణ్యం చెబుతారు. 5 తేది విజ్ఞాన అక్షర పరబ్రహ్మ యోగాలను కె.ఎన్. రామానుజా చార్యులు, 6 తేదీ రాజ విద్యా రాజ గుహ్య విభూతి యోగాన్ని జి. వెంకట నరసింహం, 7 తేది విశ్వరూప సందర్శన భక్తి యోగాలను సివాచ్ పూర్ణానంద శాస్త్రి, 8 తేది క్షేత్రజ్ఞ విభాగ గుణత్రయ విభాగ యోగములను డాక్టర్ ఉడాలి నరసింహ శాస్త్రి, 9 తేది పురుషోత్తమ ప్రాప్తి దైవాసుర సంపద్విభాగ యోగములు కోట రాజశేఖర్, 10 తేది శ్రద్ధాత్రయ విభాగ, మోక్ష సన్యాస యోగములను డాక్టర్ అమృత వాక్కుల శేషకుమార్ వివరిస్తారని నిర్వాహకులు బి. సీతారామ శాస్త్రి తెలిపారు.



### నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

E.P. 7/93 : O.S. 209 / 83

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, (ADB) కోవూరు, rep. by its Manager - పిటీషనరు

Vs

పల్లమోతు చలపతి రావు-రెస్పాండెంటు

### వేలం ప్రకటన

ఈ క్రింది షెడ్యూలు ఆస్తిని పై కోర్టు వారి ఎదుట 10.4.95 తేది ఉదయం 10.30 గంటల నుండి సాయంత్రం 5.00 గంటలలోగా బహిరంగ వేలం వేయబడును. పాట దారులు పాట పెట్టుకొనేది.

### షెడ్యూలు

నెల్లూరు డి.రి. యిలాకా నెల్లూరు సబ్ డివిజన్‌లో చేరిన కనుమూరు గ్రామంలో రెస్పాండెంట్కు హక్కు అనుభవం గల ఆస్తి వివరం.

పట్టా నెం. 835; సర్వే నెం. 1/4 విస్తీర్ణం 13.00 ఎ. or (5.264 Hc) మెట్ట భూమి.

పిటీషనరు కిమ్మత్తు రు. 20,000/-

అహినా కిమ్మత్తు రు. 15,000/-

కోవూరు ఉడాలి సుబ్రహ్మణ్యం

25.3.95 పిటీషనరు వకీలు

### అంతర్జాతీయ మహిళా దినోత్సవం!

అంతర్జాతీయ మహిళా దినోత్సవం జిల్లా మహిళా సమాఖ్య ఆధ్వర్యంలో రోటరీ ఆడిటోరియంలో ఆచార్య ఏసి రెడ్డి అధ్యక్షతన జరిగింది. ముఖ్య అతిథిగా జిల్లా జడ్జి అప్పారావు విచ్చేసి మాట్లాడారు. స్త్రీలకు చట్టాలలో కల్పించిన రక్షణ సంక్షేమాన్ని ఉపయోగించుకొని ఆర్థికంగా బలపడి స్వతంత్రంగా జీవించడం నేర్చుకోవాలని చెప్పారు. మేజిస్ట్రేట్ శ్రీమతి స్వర్ణకుమారి మాట్లాడుతూ అత్యాచారం, వరకట్నం, హత్య కేసుల్లో చనిపోతున్న స్త్రీల మరణానికి అత్త, ఆడబిడ్డ, తోడికోడలు రూపంలో వుండే స్త్రీలే కారణం కావడం శోచనీయ మన్నారు. సమాఖ్య అధ్యక్షురాలు న్యాయవాది రమణమ్మ, నావా అధ్యక్షుడు ఐ.వి.ఎస్. నాయుడు, వొమ్మిన సుబ్రహ్మణ్యం, సిసి సుబ్బరాయుడు, శ్రీమతి బి.వి. లక్ష్మి వేదిక నలంకరించారు. కుమారి మైథిలి ప్రార్థనా గీతంతో సభ మొదలయ్యింది.

### సిపిఎం దౌర్జన్యం వల్ల గెలువలేక పోయా!

పోలింగ్ రోజున 13 వార్డుల్లో ఆత్మకూరు, దామరమడుగు, కొడవలూరు ప్రాంతాల నుంచి వచ్చిన సిపిఎం కార్యకర్తలు అరాచకాలు చేసినట్లు ఆ వార్డులో ఓడిపోయిన కాంగ్రెస్ అభ్యర్థి వంటిల్లపల్లి అరుణమ్మ ఆరోపించారు. సిపిఎం వారి ఆగడాలకు కాంగ్రెస్ కార్యకర్తలు, ఓటర్లు భయభ్రాంతు లయ్యారని; ముఖ్యంగా మహిళా ఓటర్లను అవమాన పర్చినట్లు చెప్పారు. పోలింగ్ కేంద్రం నుంచి వెళ్ళకుంటే తనను చంపుతామని బెదిరించారని ఈ విషయాలన్నీ ఎన్నికల సంఘం దృష్టికి తీసుకు వెళ్లి కోర్టుకు వెళ్లనున్నట్లు చెప్పారామె.

### ఉచిత డయాబెటిక్ శిబిరం

అతి కొద్ది కాలంలోనే అందరి అభిమానాన్ని పొందిన మధుమేహ డాక్టర్ సత్యనారాయణ తన డయాబెటిక్ క్లినిక్ ప్రారంభించి పదేళ్లు పూర్తయిన సందర్భంగా ఉచిత డయాబెటిక్ శిబిరం నిర్వహిస్తున్నారు. ఏప్రెల్ 6 తేదిన జరిగే శిబిరంలో యు.ఎస్.వి. మందుల కంపెనీ సౌజన్యంతో రక్త, మూత్ర పరీక్షలు ఉచితంగా చేసి మందులు ఇస్తారు. ప్రస్తుతం క్లినిక్‌లో ఇ.సి.జి., డోప్లర్ రక్త ప్రసార పరీక్ష, మూడు నెలలుగా వున్న చక్కెర వ్యాధి తీవ్రతను కనుగొనే హెచ్.బి.ఎ.బిన్.సి. పరీక్షలు చేస్తున్నట్లు డాక్టరు చెప్పారు.

### జిల్లాలో రక్తదాతలు పెరగడం ఆనందం!

జిల్లాలో రక్తదాతల సంఖ్య పెరగడం సంతోష కరమైన విషయమని జిల్లా కలెక్టర్ డాక్టర్ ప్రేమ్‌చంద్ చెప్పారు. రెడ్ క్రాస్ సొసైటీ రక్త నిధి భవన పునర్నిర్మాణ ప్రారంభోత్సవ సభలో మాట్లాడారాయన. రక్త దానం చేసి ప్రాణాపాయ స్థితిలో వున్న వ్యక్తిని కాపాడామన్న ఆత్మ సంతృప్తి మాటల్లో వర్ణించ లేమన్నారు. మాగుంట రాఘవ రెడ్డి ఛారిటబుల్ ట్రస్ట్ తరపున రెండున్నర లక్షలు రూపాయల చెక్కును ఒంగోలు ఎమ్పీ మాగుంట సుబ్బరామి రెడ్డి ఈ సభలో కలెక్టర్‌కు అందజేశారు. జిల్లా రెడ్ క్రాస్ సొసైటీ కార్యదర్శి డాక్టర్ ఎ.వి. సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ 20 లక్షల రూపాయల ఖర్చుతో ఏర్పాటు చేస్తున్న ఈ బ్లడ్ బ్యాంకుకు ఇప్పటి వరకు 8,77,098 రూపాయలు విరాళంగా వచ్చిందన్నారు. నిరుపేదలకు వుచితంగా రక్త దానం పొందే ఏర్పాటు ఇక్కడ చేస్తున్నట్లు చెప్పారాయన. కార్యక్రమంలో జాయింట్ కలెక్టర్ ఎం.ఆర్. నాయక్, స్విమ్స్ ఛీఫ్ బ్లడ్ బ్యాంకు అధికారి డాక్టరు బాల్లి, జెట్టి శేషారెడ్డి, పివి ప్రసన్న రెడ్డి పాల్గొన్నారు.

### డాక్టరు జయప్రదకు ఆకాశవాణి అవార్డు

రచయిత్రి డాక్టర్ పెళ్లకూరు జయప్రద వ్రాసిన 'సందిగ్ధం' రచనకు విజయవాడ ఆకాశవాణి కేంద్రం అవార్డు ప్రకటించింది. 94లో ప్రసారమైన కుటుంబ సంక్షేమ కార్యక్రమాల్లో ఈ రచనను ఎంపిక చేసినట్లు స్టేషన్ డైరక్టర్ ఆర్.ఎ. పద్మనాభ రావు సందేశం పంపారు.

### అయ్యప్ప సేవా సమాజం నూతన కార్యవర్గం

శ్రీస్వామి అయ్యప్ప సేవా సమాజం నూతన కార్యవర్గాన్ని ఇటీవల ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. అధ్యక్షునిగా బి. చంద్రస్వామి, ఉపాధ్యక్షునిగా ఎన్. రమణయ్య, కార్యదర్శిగా బి. శేషగిరి రావు, ఎ. హరికిషోర్ రెడ్డి కోశాధికారిగా, సహకార్యదర్శిగా యం. చందన్.

### అన్నిటా ఆర్టీసియే మిన్న

ఆర్టీసి క్రీడా సాంస్కృతిక సమాఖ్య 26వ రాష్ట్రస్థాయి ఉత్సవాలతో 23,24,25 తేదుల్లో నెల్లూరులోని కస్తూర్బా కళాక్షేత్రం కళకళ లాడి పోయింది. విశాఖపట్నంలో జరగాల్సిన వుత్సవాలను నెల్లూరు ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ ప్రభాకర గుప్త విజయ వంతంగా నెల్లూరులో జరిపించడానికి కష్టపడ్డారు. తొలిరోజు కార్యక్రమంలో సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, నాటక ప్రయోక్తలు ధారా రామనాథశాస్త్రి, చాట్ల శ్రీరాములు, పౌరాణిక దర్శక బ్రహ్మ కమలాకర కామేశ్వరరావు పాల్గొన్నారు. ముగింపు కార్యక్రమంలో రవాణాశాఖ మంత్రి పి. చంద్ర శేఖర్ ముఖ్య అతిధిగా పాల్గొని ప్రసంగించారు. ఆర్టీసి ప్రజాసేవ లోనే గాక క్రీడలు, కళా రంగాల్లో ఇతర సంస్థల కన్నా ముందుందని ప్రశంసించారు. ఆర్టీసి ఎం.డి. ఎస్.వి. ప్రసాద్ మాట్లాడుతూ ఏటా క్రీడలు, కళాభివృద్ధికి ఆర్టీసీకో సంస్థకు ఇస్తున్న గ్రాంటును రెట్టింపు చేస్తానని వాగ్దానం చేశారు. కార్మికులు ప్రదర్శించిన ఈహామృగం, జంబూ ద్వీపం, అయోధ్య, నాటికలు పలువుర్ని ఆలోచింప చేసి బహుమతులు కొట్టేశాయి. మగవారి మాయలు అనే హాస్య నాటిక ప్రదర్శించి ఆర్టీసి అధికారులు తమలో కళాతృష్ణ వున్నట్లు చాటారు. వందలాది మంది కళాకారులు, వేలాది మంది ప్రేక్షకులు ఆనందపడే విధంగా కార్యక్రమాలను రూపొందించిన ఆర్టీసీ అధ్యక్ష కార్యదర్శులు ఐడి.రమణయ్య, జి. రామకృష్ణ అభినందనీయులు.

## పంచాంగం

5 పేజీ కొరవ

ప్రవేశం జరుగుతుంది. ప్రవేశ కాలా నన్నుసరించి సకాలంలో సంతృప్తి కరంగా వర్షాలుంటాయి. దక్షిణ దేశం సస్య సమృద్ధియు, ఉత్తర దేశంలో కొంత సస్య నాశనం కలుగుతుంది. మొత్తానికి పంటల ఉత్పత్తి గత సంవత్సరం కంటే ఎక్కువగా సంతృప్తిగా వుంటుంది. ధర్మకార్యాలు బాగా జరుగుతాయి.

### మౌఢ్యాలు

8.95 తేది శుక్రవారం మొదలు .10.95 ఆదివారం వరకు శుక్ర మౌఢ్యమి. జూలై, ఆగష్టు, సెప్టెంబరు నెలలో శుభకార్యాలుండవు. తిరిగి 5.12.95 తేది మొదలు 2.1.1996 వరకు గురు మౌఢ్యమి. పై రెండు మౌఢ్యము లందు శుభకార్యాలు చేయరాదు.

### గ్రహణాలు

15.4.95 తేది శనివారం 4.56 గంటల నుండి 6.22 గంటల వరకు చంద్ర గ్రహణం. గ్రహణం స్వల్ప కాలం మాత్రమే అనగా పది నిమిషాలు మాత్రమే కనిపిస్తుంది.

24.10.95 తేది మంగళ వారం ఉ. 7.00 గంటలకు మొదలు 10.32 గంటల వరకు సంపూర్ణ సూర్య గ్రహణం కనిపిస్తుంది. గ్రహణం తరువాత పితృకర్మలు ఆచరిస్తే మంచిది.

### పుష్కరాలు

5.12.95 మంగళ వారం రాత్రి 11.49 గంటలకు గురువు ధనస్సు రాశి యందు ప్రవేశం. పుష్కర వాహిని నదికి పుష్కరాలు.

### మకర సంక్రాంతి

14.1.96 తేది ఆదివారం రా. 2.35 గంటలకు మకర రాశి లోనికి రవి ప్రవేశం. అందువల్ల 15 తేది సోమవారం ప 12.30 గంటల వరకు ఉత్తరాయణ పుణ్యకాలం. తర్పణాది కార్యాలు చేసుకోవచ్చు. మకర సంక్రమణ సమయ గ్రహస్థితి ననుసరించి ఫలితాలు.

వైశ్యులు, విజ్ఞాన శాస్త్ర వేత్తలందు ప్రముఖుల మరణాలు ఆహార ధరల పెరుగుదల, చోర బాధ; దేశ దక్షిణ ప్రాంతాల్లో అక్టోబరు, డిసెంబరు నెలల మధ్య రాజకీయ ఉపద్రవాలు, మార్పులు కలుగుతాయి. ప్రజలకు సంతృప్తి కరంగా సుఖ శాంతు లుండవు.

### గ్రహకూటాల ఫలితాలు

కార్తీక మాసం గురు, కుజ, రవి, బుధ, శుక్రుల పంచ గ్రహ కూటమి. దీనివల్ల విపరీత ప్రకృతి వైపరీత్యాలు. జననష్టం. ఇదే నెలలో షడ్గ్రహ కూటమి కలదు. దీనివల్ల జల ప్రళయాలు కలుగ వచ్చును. (బహుశా తుఫానులు రావచ్చు) ఫాల్గుణ మాసంలో (మార్చి, ఫిబ్రవరి నెలలో) రవి కుజ బుధ శని శుక్ర గ్రహాల పంచ గ్రహ కూటమి కలుగుతుంది. జన నష్టం. అతి కష్టం మీద మరలా ప్రస్తుతం వున్న కేంద్ర ప్రభుత్వమే తిరిగి ఏర్పడుతుంది.

మొత్తం దుష్ఫలితాల ప్రభావం యువ నామ సంవత్సరంలో ఎక్కువగానే గోచరిస్తుంది.

# శ్రీ సాయిబాబా మందిరం - గాంధీనగర్ - నెల్లూరు - ఫోన్: 27771



1930 సంవత్సరము నుండి ఇరవై సంవత్సరములకు పైగా డా.రాజగోపాలాచారి గారు నెల్లూరు రాజవీధిలో శ్రీ షిరిడి సాయిబాబా ఫోటోను పెట్టి ప్రతి దినము పూజా కార్యక్రమములు నిర్వహించు చుండెడి వారు. కొన్ని సంవత్సరముల తర్వాత ట్రంకురోడ్డులోని కో ఆపరేటివ్ బ్యాంకు ఎదురుగా వున్న ఇంటికి శ్రీ సాయిబాబా ఫోటోను మార్చిరి.

శ్రీ నేబాల లక్ష్మి నరసారెడ్డి గారి దాతృత్వముతో ప్రస్తుతము వున్న గాంధీనగరులో సాయిబాబాకు చిన్న మందిరము నిర్మించుటకు 1956 సంవత్సరములో శంకుస్థాపన జరిగినది. పిమ్మట 1958 సం. విజయదశమి నాడు మందిర ప్రారంభోత్సవము జరిగినది. డా.రాజగోపాలాచారి, శ్రీ ముంగమూరు వెంకట సుబ్బారావు, డా. ఎస్. విశ్వనాథం, శ్రీ ప్రతి విశ్వనాథం, శ్రీ ఎన్. లక్ష్మి నారాయణ, శ్రీ మాకాజీ సుబ్రమణ్యం మొదలు వారి సంపూర్ణ సహకారముతో ఈ మందిర నిర్మాణము జరిగినది.



ప్రస్తుతమున్న కమిటీ 1987 సం.న ఎన్నిక ద్వారా అధికారము చేపట్టినది మొదలు హుండీ నెలసరి ఆదాయము షుమారు ఆరు వేల రూపాయలు వచ్చుచుండినది. మందిర రూపు రేఖలు అస్తవ్యస్థముగా వున్నందున దానిని నిజమైన బాబానివాసముగా చేయ సంకల్పించుటకు మందిర కమిటీ నిర్ణయించి మందిరమును పునరుద్ధరించుటకు సరియైన ఆర్థిక వనరులు లేనందు వలన దాతలనుండి విరాళములు వసూలు చేయుటకు నిర్ణయము తీసి కొనబడినది. ఈ విషయమై చాలా కొద్ది మంది దాతలకు మాత్రమే తెలుపుట కూడా జరిగినది. మూడు సంవత్సరముల తర్వాత శ్రీ సాయిబాబా తనకు తానే నెలసరి హుండీ ఆదాయము రూ. 50,000/- లకు పైన వచ్చునట్లు చేసి తన మందిర నిర్మాణమునకు తానే సహకరించారు. 1992 సంవత్సరము నుండి మందిర పునర్మిర్మాణము చేపట్టుటకు దేవస్థాన పాలక వర్గానికి ధైర్యము వచ్చినది. అందరు కమిటీ మెంబర్లు సాయి భక్తుల పూర్తి సహకారముతో షిర్డి సాయిబాబా మందిరం నమూనాగా తీసుకొని కొన్నిట అభివృద్ధి చేసి మందిర నిర్మాణంను 35 లక్షల రూపాయల ఖర్చుతో పూర్తి గావించిరి. త్వరలోనే పీఠాధిపతి ద్వారా కుంబాభిషేకము కూడా చేయించనున్నారు. భక్తులకు శ్రీ సాయిబాబా కరుణా కటాక్షములు చేకూర్చి కాపాడవలెను.





ఈ కార్యమును ఎన్నో వ్యయప్రయాసల కోర్చి నిర్విఘ్నముగా పూర్తి చేసిన శ్రీ సాయిభక్త మండలి వారెంతో ధన్యులు.



Edited, Printed and Published by N. Dolendra Prasad at ZaminRyot